## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్థం తాము సేకరించిన విలువైన గ్రంధాలను **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ఆర్కైవ్** వారి వెబ్ సైట్: https://archive.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో సాధకులు,జిజ్ఞాసువులు **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు.వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

## ఆర్కైవ్ వారి వెబ్ సైట్:

## https://archive.org/

Internet Archive: Digital Li ×

https://archive.org

INTERNET ARCHIVE

Universal access to all knowledge

Web Video Texts Audio Software About Account TVNews OpenLibrary

Donate | Store | Blog | FAQ | Jobs | Volunteer Positions

Search: All Media Types Advanced Search

Hello Komireddy (not you? sign in or log out) Upload

**Announcements (more)**

Millions of historic images posted to Flickr

Zoia Horn, librarian and activist, dies

Working to Stop Rewriting Copyright Laws via TPP Treaty

**Web 426 billion pages saved over time**

INTERNET ARCHIVE WaybackMachine http:// BROWSE HISTORY

**Welcome to the Archive** RSS

The Internet Archive, a 501(c)(3) non-profit, is building a digital library of Internet sites and other cultural artifacts in digital form. Like a paper library, we provide free access to researchers, historians, scholars, the print disabled, and the general public.

**Video** Browse (by keyword)
1,721,625 movies
Curator's Choice (more)
Noveltoon: The Stupidstitious Cat
A very superstitious cat tries to catch Buzzy for breakfast but Buzzy outsmarts him. Animation by...
Recent Review
Little Ol Bosko In Bagdad
Average rating:

**Live Music** Browse (by band)
131,731 concerts
Curator's Choice (more)
Yarn Live at Towne Crier Cafe on 2014-02-16
01. intro 02. Time Burns On 03. I Hate You 04. Down On Your Luck 05. Lost Cause 06. Christopher...
Recent Review
Grateful Dead Live at Merriweather Post Pavilion on 1985-06-30
Average rating:

**Audio** Browse (by keyword)
2,095,303 recordings
Curator's Choice (more)
contra32: Infex - Type-E
How exactly does one create a golem? Although there are many variations in recorded methods and...
Recent Review
KM/TB Sol Rezza 2014
Average rating:

**Texts** Browse (by keyword)
6,509,320 texts
Curator's Choice (more)
The Orchid world. A monthly illustrated journal...
No more published
Recent Review
الأسطوانة الرابعة 04 - أبحاث علمية - تربية وتعليم
Average rating:

**Most recent posts (write a post by going to a forum) more...**

| Subject | Poster | Forum | Replies | Date |
|---|---|---|---|---|
| PLEASE DELETE | kiwi9000 | forums | 0 | 1 hour ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: You don't have to ask, cause you already know | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |

**Institutional Support**

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నీతికథలు



జి. పుండరీకాక్షరావు, యం. ఎ.

గ్రేడు - I తెలుగుపండిట్

జిల్లా ప్రజాపరిషత్ ఉన్నత పాఠశాల

పొనుగుపాడు

## విషయ సూచిక

సూక్తులు :–

- శీలేన శోభతే విద్యా.
- శ్రద్ధావాన్ లభతేజ్ఞానం.
- విద్యాదదాతి వినయం.
- విద్యాధనం సర్వధన ప్రధానం.
- జిహ్వాగ్రే వర్తతే లక్ష్మీ
- పరోపకారాయ సతాం విభూతయః.
- వాగ్భూషణం భూషణం.
- జిహ్వాగ్రే మిత్ర బాంధవాః.
- దుర్జనం దూరం వర్జయేత్.
- విభూషణం మౌనమపండితానామ్.
- పరోపకారార్థమిదం శరీరమ్.
- అహితం దుర్జన దర్శనమ్.
- విద్యా విహీనః పశుః.
- వివేకభ్రష్టానాం భవతి వినిపాతః శతముఖః

# ముందుమాట

కథలంటే పిల్లలు చెవికోసుకుంటారని లోకములో నానుడి. అందువలసనే ఏ సాహిత్యములోనైనను కథాసాహిత్యము ఒకప్రత్యేక స్థానమును సంతరించుకొని నేటికిని మూడుపువ్వులు ఆరుకాయలుగా దినదినాభివృద్ధి చెందుచూ విలసిల్లుచున్నది.

మానవుని నీతిమంతునిగాను, చక్కని మూర్తిమత్త్వముట్టిపడునట్లుగాను తీర్చిదిద్దుటయే విద్యయొక్క పరమావధి అందువలననే ప్రభుత్వము పాఠశాల కాలనిర్ణయ పట్టికలలో వివిధ అంశములతో పాటు "నీతిబోధ" ను కూడ చేర్చినది. ఇందువలన విద్యార్ధి సన్మార్గమున పయనించి శీలవంతుడై ఆదర్శవంతుడగును. ఈ ఉద్దేశముతోనే నేను విద్యార్థులకుపయుక్తమగునట్లు వ్యావహారిక భాషలో 32 కథలను రచించి "నీతికథలు" అను పుస్తకరూపమున వెలువరించుచున్నాను.

ఈ కథలలో తెలుగునానుడులు సందర్భోచితంగా ప్రయోగించితిని. ఇవికథను అర్థముచేసికొనుటకు బాగుగానుపయోగపడును. మరియును, ఈకథలు విద్యార్థి మానసిక వికాసానికి. ఉల్లాసానికి ఉపయోగపడును.

నేటి సమాజంలో అహంకారం, కృతజ్ఞత, నమ్మకద్రోహం, కల్లమాటలు, చెప్పుడుమాటలు, కొంటెసలహాలు, ఈర్ష్య అతివినయం లేనిగొప్పలు మొదలగు అవగుణములు చోటు చేసికొన్నాయి. ఇవి లేతవయసుగల బాలబాలికలపై పడకుండా చక్కని నీతితో కథలను చిత్రించాను. వీటిని సోదర ఉపాధ్యాయులు విద్యార్థులకు, చక్కగా వివరించి అందించగలరు.

పాఠ్యబోధనలో విద్యార్థులను, పాఠ్యాంశంవైపు ఉన్ముఖీక రించుటకు ఈకథలు చక్కగా తోడ్పడగలవని, ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులెల్లరకు మనవి చేయుచున్నాను. ఈకథలను పుస్తక రూపమున అచ్చువేయించుటకై మాపాఠశాల ప్రధానోపాధ్యాయులు ఉపాధ్యాయులు నన్ను ప్రోత్సహించి ముందుకు నడిపినందులకు, వారికి ధన్యవాదములు.

గౌరవనీయులైన నరసరావుపేట, జిల్లా ఉపవిద్యాశాఖాధికారి జి. సురేందర్‌గారు. తమ అభిప్రాయమును నేనుకోరగానే యిచ్చి నందుకు, వారికి నా నమస్సుమాంజలులు.

మా పాఠశాల ప్రధానోపాధ్యాయులు కె. కృష్ణమూర్తిగారు తమ అభిప్రాయములనిచ్చి నన్ను ప్రోత్సహించినందుకు వారికి నాకై మోడ్పులు.

శ్రీ రాధాకృష్ణ ప్రెస్ ప్రొప్రైటర్ బ్రహ్మశ్రీ సాగి హనుంతరావు గారు చక్కని బోర్డర్ వేసి, అందముగా ప్రింట్‌చేసినందుకు వారికి నా మనః పూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తకమును గుండ్రని వ్రాతతో ఫెయిర్ కాపీ వ్రాసిన కుమారి అన్నాప్రగడ శైలజకు మరియు ఈ పుస్తకమునకై ఎదురు చూచుచున్న మా పాఠశాల విద్యార్థినీ విద్యార్థులకు నాశుభాశీస్సులు.

పొనుగుపాడు — జి. పుండరీకాక్షరావు,

6—3—98 — M. A.,

# అభిప్రాయము

జి. పుండరీకాక్షరావు గ్రేడు-I తెలుగు పండిట్‌గారిచే రచింపబడిన "నీతికథలు" పుస్తకంలోని కథలు బాగున్నాయి. చక్కని తెలుగు నుడికారంతో భావపరిపుష్టి కల్గియున్నాయి. ఆశ, కోతికథ కానివానితో స్నేహం కథలను వేమన పద్యాలతో చక్కగా సమన్వయపరచారు. ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలల విద్యార్థులు చదువదగిన పుస్తకం. "నీతిబోధకు" పనికివచ్చే నీతిచంద్రికవంటి పుస్తకం—

నరసరావుపేట
2-3-98

**జి. సురేందర్**
జిల్లా ఉప-విద్యాశాఖాధికారి,
నరసరావుపేట.

# అభినందన

తె. కృష్ణమూర్తి,
ప్రధానోపాధ్యాయులు
జి. ప్ర. ప. ఉన్నత పాఠశాల,
పొనుగుపాడు.

మా పాఠశాల గ్రేడు-I తెలుగు పండిట్ జి. పుండరీకాక్షరావు గారు రచించిన "నీతికథలు" సులభశైలిలో చక్కని నీతులను బోధిస్తున్నాయి.

వీరు రచించిన "గీతా సూక్తులు" అను పుస్తకము ఉపాధ్యాయ చైతన్యలోని సాహిత్య వ్యాసములు మరియు పాఠశాల వార్షికోత్సవమునకు రచించిన ప్రబోధాత్మక నాటికలు మెచ్చుకొన దగినవి.

ఎవరు గొప్ప, చిన్నచూపు, పోటీ, లేనిగొప్పలు, కోతిబుద్ధి, ఆత్మవిశ్వాసం మొదలగు కథలు చక్కని నీతులను తెలియజేస్తూ ఉన్నాయి. ఉపాధ్యాయులకు పాఠ్యబోధనలో ఉన్మ్మీకరణకు చక్కగా ఉపయోగపడును. ఈపుస్తకమును విద్యార్థినీ విద్యార్థులేకాక అందరూ చదువదగిన పుస్తకముగారచించిన వీరు అభినందనీయులు.

ఇంకను మరిన్ని రచనలు అందించగలరని ఆశించుచున్నాను.

పొనుగుపాడు
5-3-98

తె. కృష్ణమూర్తి
ప్రధానోపాధ్యాయులు



# 1. ఎవరుగొప్ప

పూర్వం ఒక అడవిలో అనేక పక్షులున్నాయి. అవి ఆ అడవిలో దొరికిన ఆహారాన్ని తిని బాగా బలిసి వేటగాళ్ళ బారినుండి తప్పించుకుంటూ సుఖంగా జీవిస్తున్నాయి.

ఒక రోజున ఆ అడవికి ఎచటినుండో ఒక ముసలి కోతి వచ్చింది. అది ఆఅడవి జంతువులతో కలసిమెలసి తిరుగుచూ బాగా తెలివైనదానిలాగా వాటితో చెలామణి అవుచున్నది.

ఇట్లుండగా కొంతకాలానికి పక్షులకు, జంతువులకు తమలో తాము ఎవరుగొప్ప అనే చర్చ జరిగింది. మేము గొప్ప అంటేమేము గొప్ప అని వాదులాడుకొన్నాయి. ఎంతసేపటికి వాటి తగవు తెగలేదు. చివరకు అవి ముసలికోతి దగ్గరకుచేరి మాలో ఎవరు గొప్ప తేల్చి చెప్పమని ఏకరువు పెట్టాయి.

ముసలికోతి నెత్తిగోక్కుంటూ, పేలను నోటిలో వేసుకుంటూ వాటితో "మీలో ఎవరుగొప్ప తేల్చాలంటే ముందుగా మీరు పక్షులలో పక్షులు, జంతువులలో జంతువులు ఇట్లా ఒకరితో నొకరు యుద్ధం చేసి తేల్చుకోండి." అని చెప్పింది.

ఆ ముసలికోతి మాటలువిని అవి తమ్ము తాము మరచిపోయి ఒకదానిపై ఒకటి పడి యుద్ధం చేసుకుంటున్నాయి. అప్పుడు ఆఅడవి అంతా జంతువుల, పక్షుల అరుపులతో కోలాహలంగా మారిపోయింది. ఆ సమయంలో అడవిచెంత గల పల్లెలోని బోయవాళ్ళు ఆ కోలాహలం విని విల్లుబాణాలు తీసికోని పరుగుపరుగున అడవికి వచ్చి ప క్షు ల పై, జంతువులపై బాణాలు వేయటం ప్రారంభించారు.

వెంటనే కొన్ని పక్షులు జంతువులు అక్కడికక్కడే మరణించాయి ఇక మిగిలినవి వేటగాళ్ళ బారినుండి తప్పించుకొని పారిపోయి. చెంప లేసుకొని తమలో ఇక నుండి ఎవరు గొప్ప అనే మాట మర్చిపోయి అంతా కలసి మెలసి సుఖంగా జీవించాలని నిర్ణయించుకున్నాయి.

నీతి : ఎవరు గొప్ప అని కాదు అందరూ కలసిమెలసి జీవించాలి.

 

# 2. తొందరపాటు

పూర్వం ఒక బాటసారి వసంతకాలంలో అడవిమార్గంగుండా ఒక ఊరికి ప్రయాణిస్తూ మధ్యాహ్న సమయానికి ఒక తియ్యమామిడి చెట్టు క్రిందకు చేరాడు.

ఆ చెట్టుపైన ఒకవైపున ఒక కాకి. మరోవైపున ఒకకోకిలవున్నవి కోకిల లేత మామిడి చిగుళ్ళు తిని కమ్మని కంఠంతో కుహు - కుహు అంటూ కూస్తున్నది. చెట్టు క్రిందకు చేరిన బాటసారి కోకిల గానాన్ని కమ్మగా వింటూ సేద తీర్చుకుంటున్నాడు.

ఇలా కోకిల కొంత సమయం కూసి ఆచెట్టునుండి వేరొకచెట్టు పైకిలేచి ఎగిరిపోతున్నది. అదే సమయంలో ఆచెట్టుపైనున్న కాకి కావు కావు కావు మంటూ రెట్టవేసింది. అది చెట్టుక్రింద ఉన్న బాటసారి ముఖముపైన పడ్డది. బాటసారి కాకిని తిట్టుకుంటూ "ఛీ పాడు కాకి" అంటూ దగ్గరలో ఉన్న ఒకరాయిని తీసికొని ఏగిరిపోతున్న కోకిలపై విసిరాడు. కానీచెట్టుపైన కాకి మాత్రము అలాగేవున్నది. బాటసారి విసిరిన రాయి కోకిలకు తగులగానే అది గిర్రున క్రిందపడి గిలగిలా తన్నుకుంటూ ప్రాణాలు వదిలింది. బాటసారి అప్పుడు క్రిందపడ్డ కోకిలను గమనించి "అయ్యో! ఎంత తొందర పడితిని. కాకి - కోకిల రూపానికి ఒకటిగానే వుంటాయి. కాని వాటి గొంతులు వేరు - వేరు అని తెలిసి కూడా ఏమీ ఆలోచించక తొందరపాటుతో ఈ కమ్మని కోకిలనుచంపితినే" అనియనుకొనుచు కలతచెందిన మనసుతో ప్రయాణంసాగించాడు.

నీతి : తొందరపాటు తగదు.

# 3. చిన్న చూపు

పూర్వం గోదావరినదితీరాన ఒక మహారణ్యంలో పెద్దసరస్సు ఒకటి ఉన్నది. ఆ సరస్సు చెంతనే ఒక చెట్టు ఉన్నది. ఆచెట్టు కడ కొమ్మన ఒక గండుచీమ నివసిస్తున్నది.

అది ఒకసారి పెనుగాలికి తట్టుకోలేక 'కొమ్మపైనుండి సరస్సులోకిజారిపడి తీరానికి చేరుకోటానికి ఎంతో కష్టపడుతున్నది. కాని ఎంత సేపటికి ఒడ్డుకు చేరుకోలేకపోతున్నది.

ఆ సమయంలో ఒక మదపుటేనుగు ఆ సరస్సుకు వచ్చి తన పొడవాటి తొండాన్ని సరస్సులోకి చాచి నీరు త్రాగుచున్నది. అప్పుడు గండుచీమ ఏనుగును జూచి " ఓ కరిరాజా! నన్ను తీరానికి చేర్చి రక్షించు. ఈ సాయం చేయుము. నీకుకూడా ఎప్పుడైనా నాచేతనైన సాయం చేయగలదానను" అని జాలిగా ప్రార్థించింది.

అప్పుడు ఏనుగు గండుచీమ మాటలకునవ్వి "ఇంతలేవు నీవునాకు సాయం చేయగలదానవా! ప్రాణులలోకెల్లా అతి పెద్ద ప్రాణిని నేను. నీవు నాకు సాయంచేయటం వొట్టిమాట." అని అనగానే.

గండుచీమ ఏనుగుతో "ముందు నన్ను ఒడ్డుకుచేర్చి పుణ్యం కట్టుకో" మని మరోసారి ప్రార్ధించింది. ఏనుగు గర్వంతో "అట్లాఅను" అంటూ సరస్సులోకి ముందుకు ఒకఅడుగువేసి తనపొడవైన తొండాన్ని చాచి చీమను నెమ్మదిగాపట్టి చెట్టుకొమ్మకు చేర్చింది. చీమ తనకుచేసిన

సాయానికి ఏనుగుకు కృతజ్ఞతలు చెప్పింది. ఇక ఏనుగు అడవిలో తన దారిన తాను వెళ్ళిపోయింది.

ఒకరోజున కొందరు వేటగాళ్ళు విల్లుబాణాలతో ఏనుగు దంతాల కోసం ఏనుగుల వెంటపడ్డారు. కానీ ఒక్క ఏనుగుకూడా వారికి చిక్కలేదు చివరకు చేసేదిలేక వారు సరసులో విషం కలిపితే ఏ న గు లు నీరుత్రాగి మరణిస్తాయి. **అప్పుడు తేలికగా** దంతాలు తీసుకోవచ్చునని తలచి సరస్సులో విషం కలిపారు

బోయవాడు విషం కలపటం చెట్టుపైనున్న గండుచీమచూచింది. కొంత సమయానికి చీమకు సాయంచేసిన ఏనుగు బాగాదప్పికతోవచ్చి తొందర తొందరగా నీరు త్రాగబోతున్నది.

అప్పుడు చెట్టుపైనున్న గండుచీమ ఏనుగును చూచి " ఓ కరి రాజా! ఆ నీరు త్రాగకు. వేటగాళ్ళు ఈ నీటిలో విషం క లి పా రు. జాగ్రత్తగాచూడు. విషానికి నీటిలో ఉన్న చేపలు చచ్చిపోయాయి." అని చెప్పగానే ఏనుగు సరస్సులో చేపలు చచ్చిపోయి పైకి తేలుతుండటంచూచి నీరు త్రాగకుండా వెనుదిరిగి ఈ-రోజు నా ప్రాణాలు ఈ చీమ రక్షించింది. అని తలచి చీమతో ఇట్లన్నది "నన్ను మన్నించు ఓ చీమా! గర్వంతో నిన్ను నేను చిన్నచూపు చూచాను. ఈ రోజు నీవు నా ప్రాణాలు కాపాడావు. లేకుంటే దప్పికతో నున్న నేను ఈ నీటిని త్రాగి చనిపోయి ఉండేదాన్ని. నీకు కృతజ్ఞతలు చెప్పుచున్నాను." అని ఏనుగు చీమను మెచ్చుకుంటూ గోదావరీనదికి నీరు త్రాగటానికి వెళ్ళింది.

నీతి : చిన్న - పెద్ద తేడా లేకుండా ఒకరికొకరు సాయం చేసుకోవాలి.

# 4. తగిన శాస్త్రి

పూర్వం ఒక అడవిలో అనేక జంతువులున్నాయి. కాని వాటిలో నక్క మాత్రము ఒక్కటే ఉన్నది, దానికి రోజూ అడవిలోని అమాయక జంతువులకు లేనిపోని మాటలు కల్పించి తగవులు పెట్టి తమాషా చూడటం అలవాటైంది. ఆ జంతువులు చివరకు ఈ నక్కయే తమకు తగవులు పెట్టుచున్నదని తెలుసుకొని సాటి జంతువు కదా! అని చంపకుండా అడవి నుండి తరిమేసాయి.

అలా తరిమి వేయబడిన నక్క చివరకు ఒక పొలములోనికి చేరింది. ఆ పొలములో ఒక గాడిద మేత మేస్తున్నది. అది నక్కకు అమాయకంగా కనపడ్డది. నక్క దాన్ని చూచి ఈ గాడిదను అడవిలోనికి పంపించి జంతువులను తన్నించాలనుకొని నెమ్మదిగా దానిదగ్గరకు చేరి దానితో ఇలా అన్నది. " ఓ గాడిదా! ఇంకా నీవు ఇక్కడే వున్నావేమి! ఎక్కడెక్కడ గాడిదలు [illegible] అడవిలోనికి వచ్చి జంతువులపైపడి యుద్ధం చేస్తున్నాయి. జంతువులు వాటిధాటికి తట్టుకోలేక ఎటువటు పారిపోతున్నాయి. నేను కూడా పారిపోయి వచ్చాను. నువ్వు కూడా తొందరగా వెళ్ళు అని అన్నది.

నక్క మాటలు విన్న గాడిద నక్కకు తగిన శాస్త్రి చేయాలను కొని నక్కతో ఇట్లన్నది. జంతువులతో ఎలాయుద్ధం చేయాలో నాకు

తెలీదు. నీవుచెప్పు అని అన్నది. అప్పుడు నక్క నిజంగా ఈగాడిదకు యుద్ధంచేయటం తెలీదనుకొని "ఏముంది ఎగిరి కాళ్ళతో ఒక్కతన్ను తన్నితే చాలు" అన్నది. అప్పుడు గాడిద నాకు తెలీదు. కనుక ఒక్క సారినాకు నేర్పు అని నక్కతో అన్నది అమాయకంగా.

అప్పుడు నక్క గాడిద వెనుక కాళ్ళు పట్టుకొని "ఇలాఎగరాలి" అని చెప్పబోవుచుండగానే ఇదే అదను అనుకొని గాడిద బలంగా ఒక్క తన్ను తన్నింది అప్పుడు నక్క అంత దూరములో పడ్డది. దాని పళ్ళు రాలిపోయాయి, అప్పుడు నక్క తనకు తగిన శాస్తి జరిగిందని తలచి సిగ్గుతో వెళ్ళిపోయింది.

నీతి :

ఎదుటివారిని అమాయకులని అనుకొనటం పొరపాటు.

 

# 5. ఉపకారం

ఒక అడవిలో ఒక మహావృక్షం, పైన చాలా పక్షులు నివసిస్తున్నాయి క్రిందనే ఒక ఎలుగుబంటి, దానికి దగ్గరనే ఉన్న పొదలో ఒక జింక నివసిస్తున్నాయి.

ఒక రోజున ఎలుగుబంటి జబ్బున పడి ఆహారం కోసం ఎటూ వెళ్ళలేక మూలుగుతూ ఉన్నది. అప్పుడు పొదలోనున్న జింక ఎలుగుబంటి అవస్థను చూచి జాలిపడి అడవి అంతా తిరిగి కొన్ని పండ్లు తెచ్చి పెట్టింది. ఎలుగుబంటి జింక తెచ్చి పెట్టిన పండ్లు తిని నెమ్మదిగా తేరుకొని జింక చేసిన ఉపకారమును మెచ్చుకొన్నది.

అప్పుడు చెట్టుపై నున్న పక్షులు కూడా భల్లూకానికి జింక చేసిన మేలును చూచి దాని ఉపకార గుణాన్ని మెచ్చుకొన్నాయి.

ఒక రోజున జింక అడవిలో పచ్చిక కోసం తిరుగుతుండగా ఒక పులి దానిని జూచి వెంటపడ్డది, జింక పులి బారినుండి తప్పించుకోటానికి వేగంతో పరుగెత్తుతున్నది. ఈ దృశ్యాన్ని చెట్టుపై నున్న పక్షులు చూచి జింకను రక్షించాలనుకొని వెంటనే అవన్నీ రివ్వున ఎగిరిపోయి వెంటపడుచున్న పులిని కళ్ళను చుట్టేసి వాటి చుంచువులతో పొడిచేసాయి. ఇక అంతే ఆ పులి ముందుకు సాగలేక అక్కడే చతికిలబడి పోయింది జింక రక్షింపబడింది.

నీతి :

మనం ఒకరికి 'ఉపకారం' చేస్తే మనకు మరొకరు 'ఉపకారం' చేస్తారు.

# 6. కృతఘ్నత

ఒకానొక అడవిలో ఒక వ్యాఘ్రం సింహంచే చావు దెబ్బ తిని లేవలేక ఒక చెట్టు క్రిందపడి దప్పికతోనున్నది. అప్పుడు అది తనకు ఎవరు సాయం చేతురాయని తోటి జంతువుల కోసం దీనంగా ఎదురు చూస్తున్నది.

ఆ సమయంలో అటువైపు తనతోటి జంతువులైన నక్క, తోడేలు పోవటం చూచింది పులి. అవి ఎల్లప్పుడు తన వెంట తిరుగుచూ తాను మృగములను చంపి తినినప్పుడు మిగిలిన మాంసాన్ని తిని జీవించేవి. అప్పుడు పులి వాటిని చూచి " ఓ జంబుక వృకములారా ! నేను సింహముచే కొట్టబడి బాగా దాహంతో అలమటిస్తూ లేవలేని స్థితిలో ఉన్నాను మీరు సరస్సుకెళ్ళి నాకు కొంచెము నీరు తెచ్చిపెట్టండి అని వాటిని కోరింది.

అవి వ్యాఘ్రమును చూచికూడా, చూడనట్లు దాని మాటలు విని కూడా విననట్లు నటించుచూ తమదారిన తాము వెళ్ళిపోయాయి.

ఆ తరువాత జింక యొకటి అవైపు రావటంజూచి పులి దానితో తన అవస్థను చెప్పి నీరు తెచ్చి పెట్టమన్నది. జింక పులి మాటలు విని " నీకు సాయంచేయటం ఎంత తెలివి తక్కువ. నీవు క్రూరుడవు అమ్మో! నిన్ను నమ్మకూడదు! " అని అచ్చట క్షణంకూడా నుండక పరుగెత్తింది.

పులి దీనావస్థను దగ్గరలోనున్న ఒక కుందేలు చూచి జాలిపడి సరస్సుకెళ్ళి ఆకును దోనెగా చేసుకొని నీరు పలుమార్లు దా ని నో టి దగ్గరకు తెచ్చిపెట్టింది.

ఈ విధంగా కుందేలు ప్రతిరోజూ పులినోటి దగ్గరకు నీరుతెచ్చి పెడుతున్నది. కొంతకాలానికి పులి కోలుకున్నది. తరువాత కుందేలు ఎప్పటిలాగానే నీటిని పులి నోటిదగ్గరకు తెచ్చిపెట్టింది. పులి ఆకలితో వకనకలాడుతూ కుందేలుపై ఏమాత్రం జాలిచూపక, అది తనకుపకారం చేసిన సంగతి మరచి దాన్నినోటిలో వేసుకొని చప్పరించింది.

**నీతి :** క్రూరులకు మేలుచేస్తే చేసినమేలు మరచిపోయి కీడుచేస్తారు.





## 7. అల్ప బుద్ధి

ఒక అడవిలో కొన్ని కుక్కలున్నాయి. ఆ అడవికి సింహంరాజు. అదిగొప్ప ధైర్యంకలది. ఒకరోజున కుక్కలన్నీ కలసి సింహం దగ్గరకు వెళ్ళి "ఓ సింహమా! నిన్ను ఈరోజు నుండి యీ అడవికి రాజుగా మేము అంగీకరించం నీవు మాకు ఎదురుచెపితే నిన్ను మేమందరం కరచి రక్కిపెట్టి చంపేస్తాం " అని బెదిరించాయి.

సింహం ఆశ్చర్యపడింది. నన్నుచూస్తేనే పారిపోయే ఈకుక్కలు నాకెదురు నిలబడి మాట్లాడుతున్నాయి. ఒక గర్జనచేస్తే అన్నీ భయపడి పారిపోతాయి. అయినా ఈ నీచులతో నాకెందుకు వీటిని భయపెట్టి చంపితే నాకే అవమానమని తలచి గంభీరంగా కదలకుండా అలాగే నిలుచుంది.

కుక్కలు సింహం కదలకుండా వుండటంచూసి తమ మాటలకు భయపడిందని సంతోషించాయి. తరువాత అవిఅన్నీ కలసి ఒక చెట్టు క్రింద చేరి మనమందరం ఈ అడవికి ఒక శునకరాజును ఎన్నుకోవాలని తీర్మానించుకొన్నాయి. వెంటనే వాటిలో ఒకటి లేచి నేనురాజుగా ఉంటాను. మీరందరూ నన్ను ఎన్నుకోండి అన్నది. వేరొక శునకము లేచి నన్ను ఎన్నుకోండి అంది. మరొకటి లేచి నన్నే ఎన్నుకోండి. అంది. ఆ విధంగా నేనంటే నేను అని కీచులాడుకోవడం మొదలు పెట్టాయి. చివరకు కుక్కలన్నీ ఒకటినొకటి కరుచుకొని శరీరమంతా గాయాలతో రక్తసిక్తమయి ఇటూ అటూ పారిపోయాయి.

సింహం అల్పబుద్ధిగల కుక్కలను చూచి నవ్వుకొని, వేటకై అడవిలోకి వెళ్ళింది.

**నీతి :** అల్పబుద్ధులు ధీరులను ఏమీ చేయలేరు.

# 8. నమ్మకద్రోహం

పూర్వం ఒక అడవికి ఒక సింహం రాజుగా ఉండేది. అదిఒక రోజున వేటకై అడవిలో తిరుగుచుండగా, కొందరు వేటగాళ్ళు ఒక పెద్దఏనుగుపై శూలాలు విసురుతూ దాన్ని వెంబడిస్తూ ఉండటం చూచింది. దారి తెన్నులేక పారిపోతున్న ఏనుగును రక్షించాలనుకొని పెద్దగా గర్జించింది. వేటగాళ్ళు భయపడి ఎటువాళ్ళు అటు పారి పోయారు. ఏనుగుకూడా భయపడి అటు ఇటు పరుగెత్తుతున్నది. అప్పుడు సింహం నెమ్మదిగా ఏనుగు దగ్గరకువచ్చి భయపడకునిన్ను రక్షించాటానికే గర్జించాను. నిన్ను చంపాలనికాదు. నా గర్జన విని వేటగాళ్ళు భయపడి పారిపోయారు" అని ధైర్యం చెప్పి వేటకై వెళ్ళింది. సింహం తనను రక్షించినందుకు ఏనుగు కృతజ్ఞతభావంతో నెమ్మదిగా సరస్సు దగ్గరకు వెళ్ళింది నీరు త్రాగటానికి.

రాజైన ఆ సింహానికి మంత్రిగా ఒకనక్క సేనాపతిగా ఒకపులి ఉన్నాయి. నక్కమాట అంటే సింహానికి నమ్మకము పులి మాటలను పట్టించుకునేది కాదు. పులికి ఎప్పటినుంచో తనకు రాజుకావాలని కోరికున్నది. అది నక్కదగ్గరకుచేరి "సింహాన్ని చంపించు నిన్ను ఈ అడవికి రాజును చేస్తానని" ఆశచూపింది. నక్క పులిమాటలు నమ్మి సరేనన్నది.

ఒకరోజున సింహం వేటకై వెళ్తూ నక్కను తీసుకుపోయింది. సింహం బాగా వేటాడటంవలన దప్పిక వేసింది. దగ్గరలో ఉన్న పెద్ద సరస్సుకు వెళ్ళి నీరు తాగబోయింది. నక్క ఇదే సమయమని తలచి రాజా! ఆనీరు తాగకండి విషం కలిపారు వేటగాళ్ళు. ఇక్కడకుదగ్గరలో చిన్న సరస్సుఉంది అందులో నీరుతియ్యగావుంటాయి. రండి" అని అక్కడికి తీసుకుపోయింది. సింహాన్ని.

ఆ సరస్సులోని నీళ్ళు నిర్మలంగా ఉన్నాయి. తియ్యగాకూడా ఉంటాయి. కానీ అది పెద్ద ఊబి. చాలా జంతువులు దానిలోని తియ్యనినీరు త్రాగటానికిదిగిఅందులో కూరుకుపోయి చచ్చిపోయాయి. సింహానికి ఈవిషయం తెలియక నీటికోసం సరస్సులోకి దిగింది. నెమ్మదిగా ఊబిలోకి కూరుకోపోసాగింది. సింహం ఇంకచచ్చిపోవటం ఖాయమని సంతోషించి నక్క పులిదగ్గరకు చేరి తనను రాజును చెయ్యమన్నది. తను సింహాన్ని ఊబిలోకి ఎలా దింపింది వివరంగా చెప్పింది.

ఈ విషయం తెలిసి ఇక్కడ జంతువులన్నీ సమావేశమయ్యాయి. సేనాపతి అయిన పులి మన మృగరాజు మరణించాడు ఇక నేటి నుండి మనకు ఈ మంత్రిగారే దిక్కు. వీరిని రాజును చేద్దాం అంటూ నక్కను చంపి చీల్చిపారేసింది. "ఇక నేటినుండి ఈ అడవికి రాజునునేనే. నా మాటకు ఎవరు ఎదురు చెప్పినా నన్ను

13

ఎవరు ఎదిరించినా ఈ నక్కను చంపినట్లే చంపేస్తాను. అని గాండ్రించింది.

అక్కడ సింహం నక్కను నమ్మి మోసపోయినందుకు పశ్చాత్తాపపడుతూ ఎలాగో ధైర్యం తెచ్చుకొని గర్జించింది. చివరి క్షణాల్లో తాను రక్షించిన ఏనుగు ఆ సమయంలో అటువైపు తిరుగుతూండటంవల్ల సింహం ఆపదలో నున్నదని భావించి ఏనుగు పరుగు పరుగున వచ్చింది. వెంటనే తన పొడవైన తొండాన్ని సింహంమెడకు చుట్టి బయటకు లాగింది. సింహం బ్రతికింది.

అప్పుడు సింహం అడవికి వస్తూ అంతదూరంలో నుండి అంతా చూసి అర్థం చేసుకొని నమ్మక ద్రోహులను దగ్గరకు చేరనీయరాదని నిర్ణయించుకొని అడవి అంతా ప్రతిధ్వనించునట్లు పెద్దగా గర్జించింది. పులి గుండెల్లో రాయి పడ్డట్టయింది. జంతువులన్నీ తమ రాజు బ్రతికియున్నందుకు సంతోషంతో గంతులు వేశాయి. పులి దుర్బుద్ధిని, నక్క నమ్మకద్రోహాన్ని తెలుసుకున్నాయి. సింహంఅప్పటి నుండి పులిని సేనాపతిగా తీసివేసి ఏనుగును మంత్రిగాను, సేనాపతిగాను నియమించింది. పులి మొహంచెల్లక అక్కడనుండి వెళ్ళిపోయింది.

**నీతి :** నమ్మకద్రోహులను కనిపెట్టి ఉండకపోతే ముప్పుతప్పదు.

# 9. నోటిదురుసు

పూర్వం ప్రతాపవర్మ అనేరాజు కుంతలదేశాన్ని పాలిస్తూ వుండేవాడు. ఆయన పేరుకే రాజు కాని ప్రతాపంలో నేతిబీరకాయ వంటివాడు. మంత్రి మరియు సేనాపతి రాజ్యం శత్రురాజులకై వసం కాకుండా తమశక్తి యుక్తులతో కంటికిరెప్పలా కాపాడుతున్నారు. కానీ ఈ విషయం గ్రహించలేని ప్రతాపవర్మ కొలువు తీరినప్పుడల్లా "ఈరాజ్యం నా పరాక్రమం వలననే కాపాడబడుచున్నది. ఈ సేనాపతి మంత్రులవలన అసలు కానేకాదు. వీరు ఒట్టి పనికిమాలిన వాళ్ళని" గేలిచేస్తుండేవాడు-కానీ మంత్రి సేనాపతులు రాజుమాటలను పట్టించుకునేవారు కారు.

ఇట్లుండగా కొంతకాలానికి కుంతలదేశంలో వర్షాలు లేక కరువుకాటకాలు సంభవించాయి. ప్రజలకు తింటానికి సరిగాతిండిలేక త్రాగటానికి చాలినంత నీరు లేక ఇక్కట్లు పాలవుతున్నారు. రాజు మాత్రం ఏమీ పట్టించుకోలేదు. మంత్రి, సేనాపతులు, రాజుతో "ప్రజలకు ఈ సమయంలో మనం ఆదుకోవుట మన ధర్మం" అని హితవు చెప్పారు.

ప్రజలు ఇక కరువు బాధపడలేక ఒక్కుమ్మడిగా కోటలోకి ప్రవేశించి, తమగోడు, రాజుకు విన్నవించారు. రాజు వారిమాటలు

-15-

ఏమాత్రం లెక్కచేయక " ఓరీ చచ్చు పీనుగుల్లారా! వెళ్ళి బావులు తవ్వండి. దానధర్మాలు చేయండి. వెళ్ళండి అని పెద్దపెద్దగారంకెలు వేస్తూ మూర్ఖంగా కసురుకున్నాడు.

అసలే ఆకలి బాధలతోనున్న ప్రజలు రాజు నోటిదురుసు తనానికి సహించలేక ఆగ్రహంతో రాజుపైబడి గొంతునులిమేసి పీడ విరగడైనదని వెళ్ళిపోయారు

నీతి : నోటిదురుసు తనం వినాశనాన్ని తెచ్చిపెట్టును.

 

## 10. అహంకారం

ఒక అడవిలో ఒక సింహం ఉన్నది. అది తనదే ఈరాజ్యమంటూ, తానే ఈ అడవికి రాజునంటూ, తన మాటలకు తిరుగు లేదంటూ ఎదురు తిరిగిన జంతువులను చీల్చి చెండాడుతూ, అహంకారంతో నిరంకుశంగా అడవిజంతువులను పాలిస్తున్నది.

ఒకరోజు ఆ సింహం అడవిలో తిరుగుచున్నది. అప్పుడు ఒకఉడుత దానిముందుగా గంతులు వేస్తూ అటు ఇటు తిరుగుతూ " నాతో యుద్ధం చెయ్యి" అన్నది. సింహం ఉడుతను జూచి నేనంటే నీకు

భయంలేదా! నేను ఈ అడవికి రాజును. అని పెద్దగాగర్జించింది.

అపుడు ఉడుత, సింహగర్జనకు ఏమాత్రం భయపడక సింహంతో "నీ గర్జనకు ఘీంకరించే ఏనుగులు, గాండ్రించే పులులు, సకిలించే గుర్రాలు, ఓండ్రపెట్టే గాడిదలు, ఊళవేసే నక్కలు, మొరిగేకుక్కలు భయపడతాయి. కానీ నేను ఏమాత్రం భయపడను. చేతనైతేనన్ను పట్టుకో చూద్దాం అన్నది. అపుడు సింహం ఆగ్రహంతో ఒక్కసారి ఉడుతపైకి దూకింది. ఉడుత చిక్కకుండా వంకర, టింకరగా పరుగెత్తుచూ సింహాన్ని ముప్పతిప్పలు పెట్టింది. అపుడు సింహంచివరకు ఉడుతను పట్టుకోబోయి ఒకచెట్టును ఢీకొని చతికిలపడింది. అపుడు ఉడుత సింహాన్ని చూచి "నన్నే పట్టలేకపోయావు. ఇక నాతో యుద్ధం ఏమి చేస్తావో! అని పకపక నవ్వింది. ఇక చేసేదిలేక తన అహంకారానికి గర్వభంగమైనందులకు సిగ్గుతో అచ్చటినుండి నెమ్మదిగా వెళ్ళిపోయింది.

నీతి అహంకారికి గర్వభంగం తప్పదు.

 

# 11. అత్యాశ

ఒక అడవిలో నక్క యొకటి ఆహారంకోసం అడవిఅంతా తిరుగుచుండగా, దానికి ఒక మాంసపు ముక్క దొరికింది. దానిని నోట గరచుకొని తన నివాసానికి వెళ్ళి తినాలని దారి పట్టింది. అలా వెళ్ళుచుండగా, మార్గమధ్యంలో ఇంకో మాంసపు ముక్కదొరికింది. దానినికూడా నోట కరచుకొని సంతోషంతో పరుగులు తీస్తూ కొంతదూరం వెళ్ళేసరికి, మరొక మాంసపుముక్క దొరికింది. దానిని నోట కరచుకొని సంతృప్తిచెందక యింకా అడవిలో ఏమైనా ఆహారం దొరుకుతుందేమోనని అడవిఅంతా తిరుగనారంభించింది.

నక్క చివరకు, ఒక సరస్సు అవతలి తీరాన జింక ఒకటి చచ్చిపడివుండటం చూచింది. దానినికూడ తినాలని ఆశ కలిగింది. నోటిలోని మూడు మాంసపు ముక్కలను, వదలక సరస్సులోకి దిగి వేగంగా ఈదుకుంటూ అవతలి ఒడ్డుకు చేరుకున్నది. కానీ నీటిలో ఈదునపుడు నోట ఉన్న మూడుమాంసపు ముక్కలు జారిపోయాయి. తీరానికి చేరి తృప్తితో జింకను తినకుండా ఈజింక "నాకే గదా! దీనిని ఎప్పుడైనా తినవచ్చు" ననుకొని అత్యాశతో నీటిలో, జారిపోయిన మాంసపు ముక్కలకోసం సరస్సులోకి దిగి, ఈదుకుంటూ వెతకనారంభించింది. ఆ సమయంలో ఆ సరస్సులో నున్న మొసలి ఆహారంకోసం సరస్సు అంతా తిరుగుతూ ఈదుచున్న నక్కనుపట్టి సునాయాసంగా మ్రింగివేసింది.

నీతి : ఉన్నదానితో సంతృప్తిచెందక అత్యాశకుపోతే అసువులు కోల్పోదురు.

# 12. కల్లమాటలు

ఒక అడవి చెంత ఒక కొండ కలదు. ఆ కొండలో ఒక గుహ కలదు. ఆ గుహలో ఒక సింహం నివసిస్తున్నది. అదితనకు ఆకలి వేసినపుడు అడవిలోకి వెళ్ళి ఏనుగులను చంపి, తిని తిరిగి వచ్చి హాయిగా కొండ గుహలో విశ్రాంతి తీసుకుంటూ వుంటుంది. ఆ గుహలో సింహం వున్నందుకు ఆవైపు జంతువులేవి రావటానికి భయపడుతుండేవి.

ఒక రోజున ఆ అడవిలో ఒక అడవి పిల్లిని, ఒక అడవి కుక్క, చంపి తినటానికి దానివెంట పడింది. పిల్లి, కుక్కబారినుండి తప్పించుకొని, పరుగెత్తుతూ సింహం వున్న కొండగుహలోకి ప్రవేశించింది. కుక్క కొండగుహలోకి పోవటానికి భయపడి వెనుదిరిగి వెళ్ళిపోయింది.

పిల్లి, గుహలోనున్న సింహాన్నిచూచి గజగజ వణకసాగింది. అపుడు సింహం "భయపడకు, నీవు నాకు ఆహారానివి కాదు. నిన్నేమిచేయను. ఇక్కడే వుండు" అని అభయమిచ్చింది పిల్లికి. అప్పటినుండి పిల్లి గుహలోనే ఉండి అప్పుడప్పుడు బయటకువచ్చి కావలసిన ఆహారం గుహ చెంతలోనే వెదకి తిని లోపలికివెళుతూ ఉన్నది. ఇలా కొంతకాలం గడిచింది.

ఒకరోజున సింహం రోగానపడి గుహలోనే మరణించింది. ఈ సంగతి అడవి జంతువులకు తెలియదు. అపుడు పిల్లికి ఈ అడవికితాను రాజును కావాలని కోరిక కల్గింది. చనిపోయిన సింహం చెవులను నోటితో కొరికి వాటిని ఆనవాలుగా తీసుకొని ఏనుగుల దగ్గరకు వెళ్ళి " ఓ బుద్ధిహీనుల్లారా! మీకు దేహబలమే కానీ, బుద్ధి బలములేదు. సింహాన్ని నా బుద్ధిబలంచేత చంపివేశాను. ఆనవాలుగా దాని చెవులుకూడా తెచ్చాను. ఇవిగో చూడండి! అని సింహం చెవులు చూపించింది. అప్పుడు ఏనుగులు సింహం చెవులుచూచి "నీవు ఇంతలేవు సింహాన్ని ఎలా చంపగలిగావు" అని అడిగాయి.

అందుకు పిల్లి ఇలా అన్నది. " నేను సింహం దగ్గరికి చాలా తెలివిగా చేరి దానితో స్నేహంచేసి రోజూ త్రాగటానికి నీరు తెచ్చిపెడ్తున్నాను. ఇట్లుండగా ఒకరోజున మిమ్మల్ని హింసించి రావటం చూచి నేను ఓర్వలేకపోయాను. ఎలాగయినా సింహాన్ని చంపాలనుకొన్నాను. త్రాగే నీటిలో దానికి విషం కలిపియిచ్చాను. అంతే ఇక కన్నుమూసింది." అని కల్లమాటలు చెప్పి ఏనుగులను గుహ చెంతకు తీసుకుపోయి చనిపోయిన సింహాన్ని చూపించి, నేను మీకన్నా, సింహంకన్నా చాలా గొప్పదాన్ని కనుక నన్ను మీరు రాజుగా చేసుకోండి " అని అన్నది.

అప్పుడు ఏనుగులు, పిల్లి కల్లమాటలు గ్రహించి ఇదినిజంగా సింహాన్ని మోసంతో చంపలేదు మనలను మాటలతో మోసంచేస్తున్నదికనుక, దీనిని పదలకూడదంటూ వెంటనే పిల్లిని తొండంతో పట్టి బండకేసి కొట్టి చంపాయి.

నీతి : కల్లమాటలు చేటును తెచ్చును.

# 13. పోటి

ఒకానొక సరస్సులో చేపలు ఒకవైపు, కప్పలు ఒకవైపు జీవిస్తున్నాయి. ఒకరోజున ఒకచేప సాటిచేపలను వదలి ఒకకప్ప దగ్గరకు వచ్చి "ఓ మండూకమా! నీవు ఈ సరస్సులో నా తో సమానంగా ఈదటానికి నాతో పోటీకి రమ్ము. ఈ పోటీలో ఎవరు ఓడిపోతే వారు గెలిచినవారిని వీపుపై నెక్కించుకొని గంతులు వేయాలి, మరి - సరేనా!" అన్నది.

చేప పెట్టిన పోటీకి, కప్ప ఒప్పుకొని సరస్సులో చేపతో సమానంగా ఈదలేక ఓడిపోయింది. ఇకకప్ప చేపను వీపుమీద ఎక్కించుకొని సరస్సులో గంతులేస్తూ ఒక్కసారిగా తీరానికిదూకింది. అప్పుడు కప్ప వీపుపైనున్న జలచరమైన చేప ఒక్కసారిగా జారి ఒడ్డునపడి విలవిల తన్నుకుంటున్నది. అప్పుడు ఆకాశంలో ఎగిరి పోవుచున్న ఒకకొంగ దానినిచూచి ముక్కున కరచుకొని చెట్టుపై పెట్టుకొని ఆరగించింది. ఉభయచరమైన కప్ప మరల సరస్సు లోకి దూకింది.

నీతి : పోటీకి, ముందు వెనుకలు ఆలోచించాలి.

-21-



# 14. లేనిగొప్పలు

ఒక విశాలమైన పచ్చికమైదానంలో గుఱ్ఱం ఒకటి గడ్డి మేస్తూవున్నది. ఆ సమయంలో గాడిద ఒకటి కాలిబంధం నుండి తప్పించుకొని వచ్చి, గడ్డిమేయడం ప్రారంభించింది.

గాడిద కొంచెంసేపు నాలుగు గడ్డిపరకలు కొరికి, తరువాత అటునిటు చూచింది. అపుడు దానికి అంతదూరంలో గడ్డిమేస్తున్న గుఱ్రం కనపడింది. ఇక గడ్డి తినడం మానేసింది. వెంటనే గుఱ్రం దగ్గరకు వెళ్ళి గుఱ్రాన్ని బాగా చూచి ఇది నా మాదిరి గానే యున్నదే. నాకు దీనికి తేడా లేనేలేదు. నేనెపుడు చూడనే లేదు. దీన్నిగురించి తెలిసికొంటాను. అని అనుకొని గడ్డిమేస్తున్న గుఱ్రంతో ఇలా అన్నది. "ఓయీ! నీవెవరు? ఒంటరిగా గడ్డి మేస్తున్నావు. నీకేం భయంలేదా!" అని గర్వంగా అడిగింది.

అపుడు గుఱ్రం గాడిదను జూచి ఇలాఅన్నది. " నేను రాజుగారి పట్టపు గుఱ్రాన్ని రాజుగారు ఎక్కడికి వెళ్ళాలన్నా నా మీదనే ఎక్కి వెళతారు. రాజుగారు మరియు ఆయన భటులు నన్ను ఎంతో ప్రేమతో చూసుకుంటారు. వారికి నేనంటే పంచ ప్రాణాలు. మా రాజుగార్కి యుద్ధ సమయంలో విజయం సాధించటానికి, నేను ముఖ్యపాత్ర వహిస్తాను. నన్ను ఎవరు దండిచరు. నాకు భయంలేదు. నన్ను గుఱ్రమని, అశ్వమని అంటారు. మరి నీ సంగతి ఏమిటని" శిరసువంచి గడ్డిమేయడం ప్రారంభించింది.

గాడిద అపుడు "ఈ గుర్రంముందు నా సంగతిచెపితే చాలా తక్కువగా ఉంటుంది. నా గురించి ఈ గుర్రానికి బహుశ తెలియదులే" అని అనుకొని యిలా లేనిగొప్పలు చెప్పింది.

"ఓయీ! అశ్వమా! నేను ఆ కనపడుచున్న కొండగుహల లోని సింహాలను, పులులను చంపి తినటం నాపని ప్రస్తుతము నా దంతాలు మొద్దుబారినాయి. ఇపుడు ఆకలికి తట్టుకోలేక కనీసం నాలుగు గడ్డి పరకలైనా తిందామని యిచ్చటికి వచ్చాను. ఇక నా అరుపులు వింటే అడవి జంతువులన్నీ భయపడి ఎటువటు పారిపోతాయి. నిజానికి సింహమును మించిన దానను నేనే, నన్ను శరభము అని అంటారు" అని చెప్పింది.

అపుడు గుర్రం, గాడిద లేనిగొప్పలు అర్థం చేసుకొని, హేళనగా సకిలింపుచేసింది. ఆ సకిలింపుకు గాడిద గుర్రంతో "ఓ అశ్వమా! చూడు, నీ కంటే నేను పెద్దగా అరవగలను" అని పెద్ద పెద్దగా ఓండ్రపెట్టడం మొదలు పెట్టింది.

ఆ సమయంలో గాడిద కోసం వెతుకుచున్న దాని యజమాని, దాని అరుపులు విని, బడియతో దాని ముందు ప్రత్యక్షమై నాలుగు తగిలించి ఇంటికి తోలుకొనిపోయాడు.

**నీతి : లేని గొప్పలు గొప్పవారిని చేయలేవు.**

# 15. ధైర్యం

పూర్వం ఒక అడవిలో ఒక చెట్టు క్రింద కలుగులో ఒక మూషికం నివసిస్తున్నది. ఒక రోజున అది ఆహారం కోసం తిరుగుచుండగా, ఒక అడవి పిల్లి దాన్ని చూచి వెంటబడింది. కాని ఎలుక పిల్లికి చిక్కకుండా తప్పించుకొని, పరిగెత్తుకుంటూ వచ్చి తన కలుగులోకి దూరి ప్రాణాలు కాపాడుకున్నది.

మరల మరొక రోజు కూడా పిల్లి ఎలుక వెంటబడింది. అదృష్టవశాత్తు తప్పించుకొన్నది. ఎలుక ఇక లాభం లేదు. ధైర్యంతో ఎలాగైనా పిల్లిని చంపించి, దాని బారినుండి రక్షించుకోవాలనుకున్నది.

ఒకరోజున వేటకుక్కలతో కొంతమంది వేటగాళ్ళు అడవికి రావటం, అప్పుడు పిల్లి ఒక చెట్టు క్రింద హాయిగా నిద్రించడం ఎలుకచూచింది, ఇక ధైర్యం వహించింది. వేటకుక్కల ముందుకు వెళ్ళి కొంచెం దూరంలో గంతులు వేయడం మొదలు పెట్టింది. కుక్కలు గంతులు వేయుచున్న ఎలుకను చూచి దానిపైపడి చంపబోయాయి. ఎలుక వాటినుండి ధైర్యంగా తప్పించుకొని గంతులు వేయుచూ పారిపోసాగింది. కుక్కలు దానివెంటపడ్డాయి.

ఎలుక పోయి, పోయి సరాసరి, పిల్లినిద్రించుచున్న చెట్టు క్రిందకు చేరి ఎగిరి గంతేసి అక్కడ ఒక పొదలోకి దూరింది. కుక్కలు, ఎలుకను వదిలివేసి నిద్రించుచున్న పిల్లిపైపడి చీల్చి చెండాడి హాయిగా ఆరగించాయి. అప్పుడు ఎలుక "హమ్మయ్య" అంటూ గుండెనిమురుకున్నది.

నీతి : ధైర్య తో తనను తాను రక్షించుకోవాలి.

-24-

# 16. కొంటె సలహా

పూర్వం ఒకానొక వనంలో చాలా జింకలున్నాయి. అవి ఆవనంలోని పచ్చికను మేసి సరస్సులోని నీరు త్రాగి హాయిగా జీవిస్తున్నాయి. ఒక సంవత్సరం వర్షాలు బాగా పడకపోవడం వలన వేసవిలో సరస్సులలోని నీరు బాగా తగ్గిపోయింది. జింకలు తమ దాహమును పూర్తిగా తీర్చుకోలేక, నీటి కొరకై యిక్కట్లపాలగుచున్నాయి. ఇక వాటికి ఏమిచేయాలో తోచక ఒక కోతి దగ్గరకు వచ్చి నీరు బాగా ఎచ్చట దొరుకునో సలహా చెప్పమని అడిగాయి.

ఆకోతి అడవిలోని చాలా జంతువులకు తప్పుడుసలహాలిచ్చి వాటిని కష్టాలకు గురిచేసింది. ఈవిషయము తెలియని అమాయకపు జింకలకు, కోతి "ఓ జింకల్లారా! నాకు ఈవనమేగాక చుట్టుపక్కల గల ప్రదేశాలన్నీ బాగా తెలుసు. ఇదిగో చూడండి! ఆ కనబడే కొండకి అవతలి వైపున ఒక పెద్ద సరస్సు వున్నది. దానిలో నిండుగా నీరున్నది. మీ దాహాలు పూర్తిగాతీరును. వెళ్ళి తాగండి" అని కొంటె సలహా యిచ్చింది.

జింకలు కొండంతఆశతో కొండవైపు శరవేగంతో పరుగెత్తి సరస్సు కోసం అటునిటు వెతకసాగాయి. అప్పుడు ఆకొండ గుహలోనున్న ఒక పులి జింకలను చూచి, గాండ్రించుచు వాటి

కోసం పరుగెత్తసాగింది. జింకలు భయపడి ప్రాణాలరచేతపట్టుకొని వ్యాఘ్రమునకు చిక్కకుండా పరుగెత్తి ప్రాణాలు నిలుపుకొని, ఇకనుండి ఏవరినిపడితే వారిని సలహాలు అడగరాదు అని నిర్ణయించుకొన్నాయి.

నీతి : సలహాలు ఎవరినిపడితే వారిని అడగరాదు.

 

## 17. చెప్పుడు మాటలు

పూర్వం ఒక రాజు చెప్పుడుమాటలంటే చెవికోసుకొనేవాడు వాటిని విని తగినవిధంగా అమలుపరిచేవాడు. కొంచెమైన వివేచనా శక్తిలేదు. తనవారెవ్వరో, ఇతరులెవ్వరో తెలుసుకోలేని మూర్ఖుడు.

ఇలా రాజు సంగతి తెలిసికొనిన కొంతమంది నీచులు రాజు చెంతకు చేరి నక్క వినయం ప్రదర్శిస్తూ, కొంత మంది రాజోద్యోగులపైన, ప్రజలపైన లేనిపోనివి కల్పించి చెప్పటం

మొదలుపెట్టారు. రాజు వారిమాటలు నమ్మి అమాయకులైన వారిని బంధించి చెరసాలలో వేయించాడు.

ఇదంతా మంత్రి తెలుసుకొని చెప్పుడుమాటలు వినవద్దని, నిజానిజాలు తెలుసుకొని దోషులను శిక్షించమని రాజుకు సవినయంగా ప్రార్థించాడు. అందులకు రాజు మంత్రిపై మండిపడి మంత్రినికూడా చెరసాలలో బంధించాడు. మంత్రిఅడ్డు తొలగడంతో నీచులకు పట్టపగ్గాలు లేకుండా పోయాయి. ఇక సేనాపతిని కూడా అడ్డుతొలగించాలనుకున్నారు.

ఒక రోజు రాత్రి ఆనీచులు రాజుగారి కోటలో ప్రవేశించి ఎంతో విలువైన వజ్రాలు దొంగిలించి ఆ నేరాన్ని సేనాపతిపై మోపారు. అందుకు తగిన సాక్ష్యాధారాలను సృష్టించి రాజుకు సవినయంగా విన్నవించారు. రాజు ఏమి విచారింపకనే వారిమాటలు నమ్మి నిర్దోషియైన సేనాపతిని ఉరి తీయించాడు.

ఇక రాజ్యంలో వారి ఆగడాలకు అడ్డు లేకుండా పోయింది. రాజ్యం వారి యిష్టారాజ్యమయింది. పొరుగు రాజు ఈవిషయమంతా వేగుల ద్వారా తెలిసికొని వేంటనే సైన్య సమేతంగా వచ్చి రాజును చంపి, నీచులను వెళ్ళగొట్టి రాజ్యాన్ని కబళించాడు.

నీతి : చెప్పుడు మాటలు చేటును తెచ్చును.

-27-

# 18. అతి వినయం

పూర్వం ఒకరాజుగారి దివాణంలో కొంతమంది ఉద్యోగులు ఉండేవారు. వీరి అధికార బాధ్యతలన్నీ మంత్రిగారు చూస్తూ వుండేవారు. ఉద్యోగులు ప్రతిరోజు దివాణానికి నిర్ణీత సమయానికి వచ్చి మంత్రిగారి కనుసన్నలలో మెలగుచూ ఎవరి పని వారు చేసుకుపోతుండేవారు. ఇట్లుండగా కొంతకాలానికి ఒక ఉద్యోగి వృద్ధుడైనందువలన ఆ ఉద్యోగానికి ఒక యువకుణ్ణి మంత్రి చేర్చుకున్నారు.

ఆ యువకుడు ప్రతిరోజు దివాణానికి నిర్ణీత సమయానికంటే ముందుగానే వచ్చేవాడు, మంత్రి కనబడినప్పుడల్లా వంగి వంగి నమస్కారాలు చేస్తూ, తనకు కాని పనిని కూడా కల్పించుకొని చేస్తూ వుండేవాడు. కాని మంత్రి ఆయువకుణ్ణి తనవిధినిర్వహణలోనే నుండమని మందలించేవాడు.

ఒక రోజున రాజుగారు గుర్రంమీద వాహ్యాళికి వెళ్ళి తిర్గి వచ్చినపుడు ఆయన వ్రేలి వజ్రపుటుంగరం జారి క్రింద పడిపోయింది. అది ఆ యువకునకు దొరికింది. యువకుడు దానిని తీసుకొని రాజు వద్దకు వచ్చి అతి వినయంతో నమస్కారం చేసి "మహారాజా! ఈ వజ్రపుటుంగరం తమరు వాహ్యాళికి వెళ్ళి తిరిగి

వచ్చునపుడు జారిపడిపోయింది. ఇది నాకు దొరికిందని" ఇచ్చి తన విశ్వాసాన్ని చాటుకున్నాడు. రాజు యువకుని యొక్క నిజాయితీని ఎంతగానోమెచ్చుకున్నాడు. క్రమంగా ఆయువకుడు రాజుచెంతకుచేరి తీయనిమాటలు చెప్పుచూ, తాను అందరిలోకంటే మిక్కిలి ప్రీతి పాత్రుడైనాడు. అప్పటినుండి ఆయువకుడు రాజుగారివద్దకు యధేచ్ఛగా రావడం పోవడం ప్రారంభించాడు. రాజభటులు అడ్డుచెప్పడానికి భయపడేవారు. పైగా రాజుగారికి తమపై ఏమి చెప్పునోయని భయపడేవారు.

ఒకరోజున దివాణంలోని కోశాగారంలో పనిచేసే ఒకఉద్యోగి హఠాత్తుగా మరణించాడు. ఇతడుప్రజలవద్ద వసూలు చేసినసుంకాన్ని లెక్కించి పెట్టెలో పెట్టి భద్రపరచేవాడు. ఈ ఉద్యోగానికి మిక్కిలి నమ్మకస్తుడైన ఉద్యోగి ఉండాలి. కనుక రాజు మంత్రిని పిలిచి కొత్తగాచేరిన యువకుణ్ణి నియమించమని ఆదేశించాడు. మంత్రి రాజు ఆదేశానుసారము ఆ యువకుణ్ణి గణకునిగా నియమించి ఒకకన్ను వేసిఉంచాడు, కొంతకాలం జరిగింది.

ఒకరోజు రాత్రి కోశాగారంలో సొమ్ము పెట్టెను ఆయువకుడు అపహరించి ఇంటికి తీసికొని వెళ్ళిసొమ్మును పెరటిలో పాతిపెట్టి ఖాళీపెట్టెను తిరిగి తీసికొనివచ్చి కోశాగారంలో పెట్టాడు. మరునాడు ఉదయం యువకుడు కోశాగారానికి వచ్చిపెట్టెను తెరచి అటునిటు

జూచి సొమ్ము దొంగిలించారంటూ మహారాజు చెంతకు పరుగున పోయి, "మహారాజా! కోశాగారంలోని సొమ్ము మాయమైంది. నిన్న మంత్రిగారు కోశాగారానికి వచ్చి నేను సొమ్ము లెక్కించుచుండగా నావద్దనుండి సొమ్మును బలంగా తీసికొని నన్ను చంపబోయాడు. అప్పుడు నేను ధైర్యంగా అడ్డగించి రాజుగారితో చెబుతాననేసరికి భయపడి అక్కడనే సొమ్మును వదలి పైగా రాజుగారితో చెబితే చంపుతానని బెదిరించాడు. చీకటిపడగానే సొమ్ముపెట్టెకు తాళం వేసి భటులను అప్రమత్తంగా ఉండమని హెచ్చరికచేసి వెళ్ళాను. కానీ ఏం లాభం! సొమ్ము మాయమైంది. మంత్రిగారే ఈ పనిచేసి ఉంటారని " రాజుగారికి మంత్రిపై గట్టిగా అనుమానము కల్గునట్లు చెప్పాడు.

యువకుని మాటలు రాజు నమ్మి మంత్రిని పిలిపించిసొమ్ము ఏమయినదని నిలదీసాడు.

అప్పుడు మంత్రి " మహారాజా! ఈదూర్తుడు సొమ్ము ను అపహరించి తనఇంటి పెరటిలో పాతిపెట్టాడు. నిన్న సాయంకాలం నేను చీకటిపడగానే నగరంలో మన-పరిపాలనను గురించి జన మేమనుకుంటున్నారో తెలిసికొనటానికి మారువేషంలో తిరుగుచుండగా ఈ యువకుడు కోశాగారపెట్టెను యింటికి తీసికొనపోవడం కళ్ళారా చూచాను. ఆ వెంటనే వీనివెంట గూఢంగా వెళ్ళి చూచాను. సొమ్మును తన ఇంటి పెరటిలో పాతిపెట్టి ఖాళీపెట్టెను

తీసికొని కోశాగారంలో తెచ్చిపెట్టాడు. ఇప్పుడు భటులను వెంటనే పంపి సొమ్మును తెప్పించండి" అన్నాడు. రాజు వెంటనే భటులను పంపాడు. భటులు యువకుని ఇంటికి వెళ్ళి పెరటిలో పాతిపెట్టిన సొమ్మును త్రవ్వి తీసికొని వచ్చి రాజు ముందుంచారు. అప్పుడు ఆ యువకుని ముఖం వెలవెలాపోయింది.

రాజు యువకుని మాటలు నమ్మి మంత్రిని అనుమానించి నందుకు క్షమాపణచెప్పి ధూర్తుడైన ఆయువకుణ్ణి ఖైదుచేయించాడు.

నీతి : అతివినయం ధూర్తలక్షణం.

 

# 19. కుక్కతోక వంకర

పూర్వం ఒకానొక రాజ్యంలో దొంగ ఒకడు దొంగతనాలు చేస్తూ, ఎవరికి చిక్కకుండా చాలాకాలం తప్పించుకుతిరుగుతున్నాడు. రాజభటులు వానికొరకు తిరిగి తిరిగి, ఎట్టకేలకు పట్టుకొని బంధించి రాజుగారి సభలో హాజరుపరచి, వాడుచేయుచున్న దొంగ తనాలు సవివరంగా చెప్పి తగిన శిక్ష వేయమని ప్రార్థించారు. అప్పుడు రాజు మంత్రితో "తమ అభిప్రాయమేమి?" అన్నాడు.

దొంగతనాలు చేసేవాని చేతులు ఖండించటమే తగిన శిక్ష కనుక ఈ దొంగ చేతులు ఖండించటమే నా అభిప్రాయమన్నాడు. రాజు మంత్రి అభిప్రాయముతో ఏకీభవించక యిలా అన్నాడు.

"ఈ దొంగచేతులు ఖండిస్తే మానసిక వ్యధతో కృంగి కృశించి నశించుతాడు. స్వయంకృషితో కష్టపడి ధనం సంపాదించి జీవించలేడు. అందువలన ఇతని పోషణ భారం కూడా తన వారికి కష్టతరమగును ఈ శిక్షవేస్తే పరోక్షంగా మనము ఇతనికి హాని చేసినవారమవుతాము. కనుక యితనిని సజ్జన సాంగత్యమున సజ్జనుడుగా మారునట్లు చేయించుదాం. అపుడు యితని జీవితంవెన్నెల వలె హాయిగా గడచిపోతుందని" విద్వాంసులను పిలిపించాడు. విద్వాంసులు రాజు ఆదేశంమేరకు వెంటనే వచ్చారు.

రాజు వారితో "మీరు విద్వాంసులు, సజ్జనులు. మీసాంగత్యం వలన ఈదొంగ సజ్జనుడుగా మారుతాడు. కనుక మీరు ఈతనిని తీసికొనివెళ్ళండి" అని అన్నాడు.

రాజు కోరినట్లుగా విద్వాంసులు దొంగను తమవెంటతీసుకొని వెళ్ళారు. వారు సభలకు వెళ్ళునపుడు తమవెంట తప్పక దొంగను తీసుకుపోతున్నారు. తీరికసమయాల్లో పురాణ కథలు, నీతి కథలు, ధర్మసూక్తులు బోధిస్తూ అతనితో కలసి మెలసి ఉంటున్నారు. క్రమంగా దొంగ వేషభాషలు మారాయి. సజ్జనుడిలాగా మారినట్లు వారితో ఉన్నాడు. కొంతకాలం జరిగింది. ఒకరోజున రాజు దొంగ వానిని పిలిపించి "నీవు సజ్జనుడిగా మారినావని భావించుతాను. ఇక జనజీవనంలో కలసి కష్టపడి జీవించు. దొంగతనాలు చేయకుమని హితవు" చెప్పి పంపాడు.

దొంగ, సజ్జనసాంగత్యం వీడినప్పటినుండి అతనికి తనపూర్వ జీవితం గుర్తుకు వచ్చింది. కష్టపడి జీవించాలనే కోరికేలేదు. ఎప్పటి మాదిరిగానే దొంగతనాలు చేస్తున్నాడు. మళ్ళీ రాజభటులుపట్టుకొని రాజుముందుంచారు. రాజు దొంగను జూచి ఈతని బుద్ధి "కుక్క తోకవంకర వంటిదని" గ్రహించి చేతులు ఖండించండని భటులను ఆదేశించాడు.

**నీతి :** పొట్లకాయ రాయి పొడవు త్రాటను కట్ట
లీలతోడ వంక లేక పెరుగు
కుక్కతోక గట్ట జక్కగా వచ్చునా
విశ్వదాభిరామ వినురవేమ!

## 20. ఆశ

పూర్వం ఒక బోయవాడు ప్రతిరోజు అడవికివెళ్ళి పక్షులను వేటాడి వాటిని చంపి నగరంలో అమ్ముకొని జీవిస్తూ ఉండేవాడు.

ఒక రోజున వాడు ఎప్పటి మాదిరిగానే వేటకోసం వలచేపట్టి కొద్దిగా నూకలు మూట కట్టుకొని అడవికి చేరుకొని, ఒక చెట్టుపై వింతపక్షిని చూశాడు. అది వింత వింత రంగులతో చూడముచ్చటగా ఉన్నది. అటువంటి పక్షిని వాడు ఎన్నడూ చూడలేదు. దానిని ఎట్లాగైనా ప్రాణాలతో పట్టుకొని మహారాజుగారికి సమర్పిస్తే మంచి బహుమానం ఇస్తారని వానికి ఆశ కలిగింది ఇక అడవిలోని పక్షులను వేటాడకుండా ఆ వింత పక్షినే పట్టాలని నిర్ణయించుకొన్నాడు.

బోయ ఆ చెట్టుక్రింద కొన్ని నూకలు చల్లి వలపన్ని దగ్గరలోనున్న ఒక పొదలో దాగి వింత పక్షికోసం పొంచిచూస్తున్నాడు. ఎంతసేపటికి ఆ పక్షి చెట్టుపైనే కదలకుండా అలాగే ఉన్నది. క్రింద ఉన్న నూకలను చూడనైనా చూడలేదు. బోయవాడు ఇక లాభంలేదని చెట్టెక్కి పట్టుకోవాలని చెట్టెక్కాడు. కాని ఆ వింత పక్షి చిక్కకుండా మరో చెట్టుపైకి వెళ్ళి చిటారుకొమ్మన వాలింది.

మరల బోయపక్షి కోసం చెట్టెక్కడం ప్రారంభించాడు. ఆ

చెట్టు తొర్రలో కొన్ని తేనెటీగలున్నాయి. అది బోయవాడు చెట్టెక్కేటపుడుకలిగిన ఆకుల అలజడికి ఒక్కసారిగా లేచి వాడినికుట్టాయి. ఇకవాడు పక్షిని పట్టుకోలేక తేనెటీగలు కుట్టిన బాధతో క్రిందకు దిగాడు.

బోయవాడు తేనెటీగలు కుట్టిన బాధను ఓర్చుకుంటూ ఈ వింతపక్షిని ఎలాగైనా పట్టుకోవాలని దీర్ఘంగా ఆలోచించాడు. చివరికి అతనికి ఒక ఉపాయం తట్టింది. ఒక పొదలో దాగి రక రకాల పక్షుల కూతలు కూస్తే ఆ వింతపక్షి తోటి పక్షుల కోసం పొదపై వాలుతుందని అప్పుడు తేలికగా పట్టుకోవచ్చని వెంటనే బోయ పొదలోకి దూరి రకరకాల పక్షికూతలు కూస్తున్నాడు. కానీ చెట్టుపైనున్న వింతపక్షి ఏమాత్రం చలించడంలేదు. చీకటిపడటం మొదలైంది.

ఇక చివరగా గుడ్లగూబల కూతలు కూస్తున్నాడు. రాత్రి మాత్రమే కళ్ళు కనపడే గుడ్లగూబలు తమతోటి పక్షులు వచ్చాయనుకొని పొదలోకి దూరాయి. అప్పుడు పొదలోనున్న బోయ వానినిచూచి మన పక్షులకు శత్రువైన బోయవాడు దొరికాడు కదా!" అని కసితీరా వాని కళ్ళు పొడిచేశాయి. వింతక్షి చెట్టు నుండి లేచి

ఎటోవెళ్ళి పోయింది. ఇక బోయవాడు చేసేదిలేక ఏడుస్తూ చీకటిలో అడవినుండి ఇంటికి వస్తూ కాలసర్పంచే అంటుకొనబడి కాలధర్మం చెందాడు.

**నీతి :** నీళ్ళలోని చేప నెరిమాంస మాశకు
గాలమందు చిక్కి కూలినట్లు
ఆశపుట్టి మనుజాడారీతి చెడిపోవు
విశ్వధాభిరామ వినురవేమ

 

# 21. ఈర్ష్య

పూర్వం గౌతమీ నదీతీరాన ఒక వనం కలదు. ఆ వనంలోని ఒక మామిడిచెట్టుపై చాలా కోకిలలు నివసిస్తున్నాయి. అవి ఆమనిరాగా మామిడిచెట్టు లేత చిగుళ్ళు తిని హాయిగా కమ్మగా, పంచమ స్వరంలో కూస్తున్నాయి. వాటి మధురమైన కంఠధ్వనికి అడవిలోని జంతువులన్నియు మెచ్చుకుంటున్నాయి. మరియు వాటిని గౌరవిస్తున్నాయి. ఈ విధంగా కోకిలలు తమ కమ్మని స్వరంతో అడవి జంతువులకు వీనులవిందు గావించుతున్నాయి.

ఇలా ఉండగా ఆ వనానికి కొన్ని కాకులు వచ్చి చేరాయి. కోకిలలను జంతువులు మెచ్చుకోవడం వాటికి సుతరాం యిష్టంలేదు. పైగా వాటినిచూస్తే కాకులకు కష్టమంటగా నున్నవి రోజురోజుకు కోకిలలపై కాకులకు ఈర్ష్య ఎక్కువగుచున్నది. ఎలాగైనా కోకిలలను చంపించాలనుకున్నాయి.

ఒకరోజున కాకులన్నీ ఒకచెట్టుపైకి చేరి "ఈ అడవికి బోయవాడు విల్లుబాణాలతోను, వలతోనూ పక్షులను వేటాడటానికవస్తాడు. అపుడు మనమందరం ఒక్కసారిగా అతనిని చుట్టుముట్టి వలను ముక్కున కరచుకొని ఆకసమున కెగరి బోయవాడు చూస్తుండగా కోకిలలున్న మామిడి చెట్టుపైన వేద్దాం. అపుడు బోయవాడు వచ్చి

చెట్టుపైనున్న కోకిలలను చూస్తాడు. అవిరూపంలోను, రంగులోను మనలాగానే ఉంటాయి కదా! యివే కాకులనుకుంటాడు. వెంటనే కోకిలలపై బాణాలువేస్తాడు. అపుడవి నేలకరుస్తాయి. మనకళ్ళు చల్ల బడతాయి. మరి సరేనా అంటే సరేనా" అనిఅనుకున్నాయి.

ఇక అవి అడవి అంతా వెతకి బోయవాణ్ణి చూచాయి. అవి అనుకున్నట్లు వలను తెచ్చి మామిడి చెట్టుపై వేసి ప్రక్కనే యున్న ఒకచెట్టుపై వాలి చూస్తున్నాయి. ఆ సమయంలో అదృష్టవశాత్తు కోకిలలు మామిడిచెట్టుపై లేవు. నీరు త్రాగటానికి నదికి వెళ్ళాయి. ఈ సంగతి కాకులు గమనించలేదు.

బోయవాడు కాకులు వెళ్ళిన వైపునకు వచ్చి, అటునిటువెతక సాగాడు చివరకు వాడు మామిడిచెట్టు చెంతనున్న చెట్టుపైకాకులను చూచాడు. ఆగ్రహం పట్టలేక ఈ కాకులు నన్ను ఈ రోజు ఎంతో కష్టపెట్టాయి, వీటిని ఇంతటితో వదలరాదు అంటూ వాటిపైబాణాలు కురిపించాడు. అపుడు కాకులు కావు కావుమంటూ, ఆక్రోశించుచూ నేలకొరిగి ప్రాణాలు వదిలాయి.

నీతి : ఈర్ష్య ప్రాణాలను కూడా తీస్తుంది.

 

# 22. మూ ఢు లు

పూర్వం ఒక వనంలో ఒక మహావృక్షం పైన చాలా మ యూ రా లు నివసిస్తున్నాయి. ఆ వృక్షం క్రింద చాలా కలుగు లున్నాయి. వాటిలో ఎన్నో ఎలుకలు చాలాకాలం నుండి జీవిస్తు న్నాయి. మయూరాల యొక్క కూతలను క్రేంకారములంటారు. వాటిని వింటే పాములకు చచ్చేభయం. వాటినిచూస్తే మయూరాలు వేటాడి చంపేస్తాయి. అందువలన ఎలుకలు కలుగులో హా యి గా జీవిస్తున్నాయి. అక్కడ మయూరాలే లేకుంటే సర్పాలు ఎలుకలను ఎప్పుడో తినేసి ఉండేవి.

ఒక రోజున మండూకం ఒకటి, ఒక పాము బా రి నుం డి తప్పించుకొని గంతులు వేస్తూ ఎలుకలున్న చెట్టుక్రిందకి వచ్చింది. ఎలుకలు హాయిగా ఉండటానికి కారణం గ్రహించింది. ఎం తో సంతోషించింది. వాటితో "ఓ మూషికాల్లారా! మీరెంతో అదృష్ట వంతులు ఈ చెట్టుపైన మయూరాలు ఉండుట వలన వాటి క్రేంకా రాలకు సర్పాలు భయపడి అసలు ఈ చోటుకు రానే రాకుండా వున్నాయి. వస్తే సర్పాలను మయూరాలు చంపేస్తాయి అందువలన మీరందరు సుఖంగా ఉన్నారు. నేనుకూడా ఇకనుండి యి చ ట నే మీతో ఉంటాను" అని అన్నది.

మూషికాలు కప్పమాటలు విని " ఓ! అమాయకపు మండూకమా! మేము చాలా కాలంనుండి ఇచ్చటనే ఉంటున్నాము. కావుననే మమ్ములను చూచి సర్పాలు భయపడి ఈవైపునకు అసలురాకుండా ఉన్నాయి. అంతేగాని ఈ చెట్టుపైనున్న మయూరాల వలన కానే కాదు. అవి చెట్లపై విహరించే పక్షులు మాత్రమే. వాటిని చూచి భయపడేవి ఈ అడవిలో లేనేలేవు." అని అన్నాయి. అపుడు మూషికాల మూఢత్వానికి మండూకం నవ్వి " ఓ మూషికాల్లారా! మీరు నిజంగా మయూరాల రక్షణలోనే ఉన్నారు నా మాట నమ్మండి అన్నది. కాని ఎలుకలు అంగీకరించలేదు. ఇక మీ దగ్గర ఉంటే నాకుకూడా ఆపద సంభవించవచ్చునని" అక్కడ ఒక్కక్షణం కూడా ఉండక గంతులువేస్తూ మరోచోటికి వెళ్ళింది కప్ప.

అలా వెళ్ళుచున్న కప్పనుచూచి ఎలుకలు విరగబడినవ్వి "ఈ మండూకం ఒట్టి పిరికిపంద. మనం ఎంతో ధైర్యవంతులం అంటూ చకచకా చెట్టుపైకి పాకి మయూరాలతో ఇట్లన్నవి.

ఓ మయూరాల్లారా! "మీ రక్షణలో మేమున్నామని, పాములంటే భయపడే ఒక కప్ప అంటున్నది. నిజానికి మేమెంతో ధైర్యవంతులం మా రక్షణలోనే మీరున్నారు" అని అన్నాయి గర్వంగా.

మయూరాలు మూషికాలను గేలిచేసి "ఓ ఎలుకల్లారా! నిజంగా మీరు మా రక్షణలోనే ఉన్నారు మేము ఈ చెట్టుపైన ఉండుటవలన సర్పాలు ఇక్కడకు రానేరావు. ఎలుకలు, కప్పలు సర్పాలకు ఆహారం అని మీకు తెలియదా! మీరు మూఢుల్లాగా ఉన్నారు." అని అన్నాయి.

అంత ఎలుకలు మయూరాలను ఆగ్రహించి మీరు "ఈ వృక్షం వదలి వెళ్ళండి లేనిచో మా పదునైన దంతాలతో మిమ్ములను కొరికి చంపేస్తాం అని బెదరించాయి.

"ఈ మూఢులకు ఎవరూ చెప్పలేరు. వీరి నాశనాన్ని వీరే కొనితెచ్చుకుంటున్నారు. ఇట్టివారిదగ్గర ఉండుటవలన మనపరువుకు కూడా భంగం కలుగుతుంది. మనమంతా, మరొకచెట్టుకు వెళ్ళి పోదామా" అని నిర్ణయించుకొని మయూరాలన్ని ఒక్కసారిగా ఆ చెట్టును వదలి అడవి అంతా క్రేంకారధ్వనులు చేసుకుంటూ మరో చెట్టుపైకి వెళ్ళివాలాయి. ఆచెట్టు ప్రాంతంలోనున్న సర్పములు మయూరములరాకను గమనించి భయపడి "ఇక మనమిక్కడ నిలువతగదు" కనుక వేరొకచోటికి వెళ్ళదామని ఎలుకలున్న చెట్టుచెంతకు వచ్చి కలుగులను జూచి, వాటిలో ప్రవేశించి ఎలుకలను మింగివేశాయి.

నీతి : మూఢులు ఎవరు చెప్పినా వినక, ఆపదలు వారంతట వారే తెచ్చుకుంటారు.

# 23. నీచులు

పూర్వం కృష్ణానదీ తీరాన ఒక ఫలవృక్షంమీద చాలా చిలుకలు కలవు. అవి ఆ చెట్టు పండ్లను తిని, కిలకిలారావములు చేస్తూ ఆనందంతో జీవిస్తున్నాయి.

ఒకరోజున రెండుకాకులు ఆ చెట్టుపైగా వెళుతూ పండ్లను చూచాయి. వెంటనే వాటిని తినాలని అవి చెట్టుపై వాలి, పండ్లను పొడుచుకొని తింటున్నాయి. అప్పుడు చెట్టుపైనున్న చిలుకలుచూచి "ఓ కరటములారా! ఈచెట్టు పండ్లను మాత్రమే తిని మేముజీవిస్తున్నాము. కనుక, దయచేసి మీరు మరోచోటికి వెళ్ళండి", అని ప్రార్థించాయి.

అప్పుడు కాకులు చిలుకలతో "ఓ కీరములారా! మేముమాంసాహారములను తిని తిని వాటికి రోసితిమి. ఇకనుంచి మాంసాహారము తినము. ఈపండ్లను తిని మీమాదిరి మేము కూడా ముద్దు ముద్దుగా మాట్లాడుతాము. కనుక మమ్ము ఈచెట్టుపైన ఉండనివ్వండి." అని నక్కవినయము ప్రదర్శిస్తూ పలికాయి.

ఆ అమాయకపు చిలుకలు కాకులమాటలకు "సరే" అన్నాయి. అప్పటినుండి కాకులు చెట్లపండ్లను తిన్నన్ని తిని, కొన్నింటిని ముక్కునపొడుస్తూ, మరికొన్నిటిని క్రింద పడవేస్తున్నాయి. అపుడు చిలుకలు, కాకులకు ఎన్నోసార్లు అలా చేయవద్దని చెప్పాయి. కాని

ఫలితము లేకపోయింది. చెవిటివానిముందు శంఖమూదినట్లయినది. చిలుకలు రోజురోజుకు అవేదన చెందుతున్నాయి. కాకులుమాత్రం ఆ చెట్టును వదలలేదు.

కాకులు ఒకరోజు చేపలను, మరొకరోజు కప్పలను, ఇంకొక రోజు మాంసపు ముక్కలను చెట్టుపై తెచ్చి పెట్టుకొని తినడంచేస్తున్నాయి. అందువలన చెట్టుఅంతా దుర్గంధంతో నిండిపోయింది. చిలుకలు భరించలేకుండా వున్నాయి పాపం! వాటికి ఏమిచేయాలో తోచలేదు.

ఇట్లుండగా కాకులు చిలుకలతో "ఓ చిలుకల్లారా! మీరు బాధపడకండి! మేము ఇప్పుడే ఈచెట్టును వదలి వెళ్ళుచున్నామని వెళ్ళాయి. అలా వెళ్ళిన కాకులు కొంతసమయం ఆకాశంలో అటు నిటుతిరిగి ఒకచెట్టు క్రింద బాటసారులు అన్నం తినడం చూచాయి. ఆచెట్టుపైన వాలి, ఈ ఆహారంలో రెట్టవేస్తే వాళ్ళు ఈ ఆహారాన్ని వదలివెళతారు. అపుడు మనము ఈ ఆహారమంతా తినవచ్చునని వెంటనే ఆహారంలో రెట్టవేస్తాయి. అపుడు బాటసారులు అన్నం తినడం మానేసి, అసహ్యించుకొని కాకుల వెంటపడ్డారు కాకులు తమ అలవాటు ప్రకారము తిరిగి చిలుకలున్న చెట్టుపై వాలాయి. బాటసారులు కాకులపై రాళ్ళు విసిరారు. ఆ రాళ్ళను కాకులు తప్పించుకొన్నాయి, కాని చిలుకలు తప్పించుకోలేక క్రిందపడికొన్ని

చనిపోయాయి. మిగిలినవి ఈ నీచులను మనచెంత నుండ మనుట మనదే తప్పు" అని మరోపండ్లచెట్లు కొరకై ఎగిరిపోయాయి.

నీతి : నీచులను దరిచేర నివ్వరాదు.

 

## 24. దుష్టులు

పూర్వం ఒకానొక అడవిచెంత ఒక కొంతకలదు ఆకొండన ఒక గుహకలదు. దానిలో ఒక సింహం నివసిస్తున్నది.

ఒకసారి ఆ వనంలోని పులులన్ని "సింహం మనకంటే గొప్పేమికాదు. దానిసంగతి ఇప్పుడే మనం తెల్సుకుందాం పదండి" అంటూ ఒక్కసారిగా వచ్చి సింహంపై విరుచుకు పడ్డాయి. అపుడు సింహం వాటిపైకి దూకి, తన పంజాతో వాటిని తీవ్రంగా కొట్టి ఒకదానిని తన పదునైన దంష్ట్రిలతో చీల్చి చంపేసింది. ఇకతక్కిన పులులన్ని భయపడి పారిపోయాయి. అది మొదలుగా పులులు ఆ కొండ గుహవైపు రావడానికి కూడా జంకేవి.

ఒకరోజున ఆవనానికి రెండుకుక్కలు వచ్చాయి. అవిప్రతిరోజు పులులు తెచ్చుకున్న మాంసాన్ని దొంగిలించి తింటున్నాయి. పులులు కనిపెట్టి వాటి వెంటపడ్డాయి. అవిపులులకు చిక్కకుండా కొండగుహ లోకిదూరాయి. పులులు, గుహవైపు రాకుండా వెనుతిరిగి పోయాయి.

గుహలోనికి దూరిన కుక్కలు సింహాన్నిచూచి భయపడ్డాయి. ముందు నుయ్యి వెనుక గొయ్యి అన్నట్లున్నది వాటి పరిస్థితి. దీని కెట్లైనా నమ్మకము కలుగచేయాలనుకొని, సింహంతో "ఓమృగరాజా మాకసలు ఆహారం ఎక్కడా దొరకడంలేదు. అందువలన ఆకలితో అలమటిస్తున్నాం. మా ఆకలిని తీర్చుకోటానికి కనీసం ఈ వనం లోని పండ్లనైనా తిందామని వచ్చాం. కాని ఏం లాభం! మేము చేసుకున్న పాపం! ఈ వనంలోని పులులు ఈ వనం మాది. ఈ వనంలోకి ఎవ్వరూ రాకూడదు. వచ్చినా వారిని చంపేస్తాం అంటూ మావెంటపడ్డాయి. ఇక మేము దైవంపై భారంవేసి పరుగెత్తి చివ రకు మిమ్ములను శరణువేడడానికి, ఈగుహలోకి వచ్చాము. ఇక నుండి మేము అడవిలోని పండ్లను తెచ్చుకొని తింటూ ఇక్కడే ఉంటాము" మహాత్ములైన మీరు కాదు కూడదంటే ఇక మాగతి ఏమి? మాకు దిక్కెవరు? అని మొసలికన్నీరు కార్చుచూ నిలబడ్డాయి.

సింహం కుక్కల మాటలను నమ్మి "సరే" అన్నట్లు తల వూపింది. కుక్కలు ఆనందంతో తోకలాడించాయి. మన పంట పండిందనుకున్నాయి. సింహం వేటకై అడవికి వెళ్ళగానే, పులులు

తెచ్చుకొన్న మాంసాన్ని ప్రతిరోజుదొంగిలించి, గుహలో ఒకమూలన పెట్టుకొని తినసాగాయి. సింహం వచ్చేటప్పటికి బుద్ధిమంతులలాగా వుండేవి. ఇదంతా ఆ గృహచెంతనే ఒకచెట్టుపైనున్న కోతి గమనించుచున్నది.

కుక్కలు మాంసాన్ని దొంగిలించి గుహకు తీసుకు పోవడం పులులు చూస్తూనే ఉన్నాయి. కాని ఎంతకాలమని ఊరుకొనగలవు. ఇక అవి ఉండలేక గుహచెంతకు వచ్చి "ఓ సింహమా! నీవొక వీరుడవా! కుక్కలచే దొంగతనంగా మాంసాన్ని తెప్పించుకుంటున్నావు. అసలు నీకు వేటాడటం వచ్చునా! గుహనుండి బయటకి రమ్ము నీ పని చెప్తాం." అని పెద్దపెద్దగా అరిచాయి.

సింహం క్రోధంతో గర్జించుచూ గుహనుండి వెలుపలికి వచ్చి "నాపై అసత్యములు పలుకుచున్నారు. మిమ్ములనిపుడేచంపేస్తాను," అంటూ పులులపై పడబోయింది.

ఆ సమయంలో అక్కడే చెట్టుపైనున్న మర్కటము, "ఓ మృగరాజా! నీవు వీరుడవు, మరియు సత్యవంతుడవు. కాని ఏమి ఆలోచింపకనే దుష్టులైన కుక్కలకు ఆశ్రయమిచ్చావు. అవి వొట్టి దొంగలు. నీవు వేటకు వెళ్ళిన సమయంలో మాంసాన్ని దొంగిలించి నీగుహలో ఒకమూలన పెట్టుకొనితింటున్నాయి. అవి మాంసంతినగా

మిగిలిన ఎముకల గుట్టలను చూడుము. ఇదంతా నేను ఈచెట్టుపై నుండి రోజూ గమనించుచున్నాను" అని అన్నది.

అపుడు కుక్కలు అక్కడనుండి నెమ్మదిగా జారుకుంటున్నాయి. అది గమనించిన పులులు వాటిపైపడి చంపి డొక్క చీల్చి డోలు కట్టాయి.

సింహం, నేను ఏమి ఆలోచించక దుష్టులను దగ్గరికి చేర్చుకొని అవమానాల పాలయితిని, అని చింతించుచూ గుహలోకి వెళ్ళింది.

నీతి : దుష్టులను దూరముగా నుంచుము.

## 25. కోతి బుద్ధి

పూర్వం వింధ్యారణ్యంలో ఎన్నో పక్షులు నివసిస్తూఉండేవి. వాటికి రాజు గండభేరుండ పక్షి. అది పక్షులన్నింటిని కన్నబిడ్డల్లా కాపాడుతున్నది. వేసవికాలంలో ఆ పక్షులకు చాలినంత ఆహారం నీరు అడవిలో దొరికేవి కావు. గండభేరుండం అడవిదాటి వెళ్ళి

తను ఆహారం ఎక్కడ దొరుకుతుందో చూచివచ్చి, తనవెంట మిగిలిన పక్షులనన్నింటిని తీసికొనిపోయి, ఆహారం, నీరు చూపించేది. పక్షులు హాయిగా ఆహారంతిని సాయంకాలానికి తమ తమ గూళ్ళకు చేరేవి. వస్తూ కొంత ఆహారంకూడా తెచ్చేవి తమపిల్లలకోసం.

ఆ అడవిలోనే కొన్ని కోతులున్నాయి. వేసవికాలంలో వాటికి తగినంత ఆహారం దొరికేదికాదు. అవి ఆహారంకోసం అలమటిస్తు వున్నవి. పక్షులు వాటినిచూచి జాలిపడి తాము తెచ్చుతున్న ఆహారంలోకొంత పెట్టేవి. కోతులు హాయిగాతినేవి, కాని పక్షులపై అవి కృతజ్ఞత చూపేవికావు.

ఒకరోజున కోతులన్నీ కలసి తమకు ఒకరాజు కావాలని అడవి అంతా గాలించాయి. చివరకు వాటికి ఒక వృద్ధ మర్కటము కనపడింది. అవి దానిని తీసుకువచ్చి తమకు రాజుగా చేసుకొని మురిసిపోయాయి. కోతులు తెచ్చిపెట్టే ఆహారాన్ని ఆ ముసలి కోతి బాగా తింటూ వున్నది. కోతులు తమకు రాజు ఉన్నాడని గర్వంతో అప్పుడప్పుడు పక్షులతో గిల్లి కజ్జాలు పెట్టుకొనేవి. పక్షిరాజు కోతి చేష్టలను గమనించి తగిన సమయంలో గుణపాఠం చెప్పాలనుకున్నది.

ఇట్లుండగా వృద్ధవానరానికి ఒకదుర్బుద్ధి పుట్టింది. ఆపక్షులకు కూడా రాజు కావాలని కోతులు అన్నిటిని పిలిచి "ఓ వానరులారా!

ఈ గండభేరుండ పక్షి ఈ అడవిలోని ఆహారం అంతా తినేస్తున్నది. వేసవికాలం రాబోవుచున్నది. ముందుగా మనంజాగ్రత్తపడాలి అందుకు మీరందరు కలసి, ఆ గండభేరుండాన్ని చంపండి" అని పురికొల్పింది.

వానరరాజు వానరులకు చెప్పిన మాటలు విన్న పక్షులు భయపడి వెంటనే వెళ్ళి పక్షిరాజుకు చెప్పాయి.

గండభేరుండం పక్షులకు ధైర్యంచెప్పి తనను చంపటానికి చెట్టెక్కి వస్తున్న కోతులను చూచి "ఓరి దౌర్భాగ్యులారా! మీకు తగిన శాస్తి చేస్తాను చూడండి" అంటూ తన విశాలమైనరెక్కలతో పొడవైన కాళ్ళతో కోతులను చెట్టునుండి క్రిందకుతోస్తూ ముంచుకుతోపాడిచింది. ఆ కోతులు పక్షిరాజు దెబ్బలకు తట్టుకోలేక కొన్ని పారిపోయాయి. కొన్ని క్రిందపడి అసువులు బాశాయి. కాళ్ళువిరిగి కొన్ని రోదిస్తూ దిక్కు మొక్కులేక అటూ యిటూ తిరుగసాగాయి. ముసలికోతి, గండభేరుండం తనను చంపుతుందేమోనని ముందుగానే అక్కడనుండి జారుకున్నది. మిగిలిన కోతులు తమరాజును నిందిస్తూ పొదలలోనికి వెళ్ళిదూరాయి.

నీతి : కోతి బట్టి తెచ్చి క్రొత్త పుట్టము గట్టి
కొండ ముచ్చులెల్ల గొలిచినట్లు
నీతిహీనునొద్ద నిర్భాగ్యులుందురు
విశ్వదాభిరామ వినురవేమ.

# 26. ఆత్మ విశ్వాసము

పూర్వం ఒకానొక అరణ్యంలో చాలా మహావృక్షాలున్నాయి. అవి చాలా ఎత్తున ఎదిగి ఆకాశాన్ని అంటుతున్నాయా అన్నట్లుండి చాలా పక్షులకు, జంతువులకు పెట్టని కోటలాగా ఆశ్రయమిస్తూ కళకళలాడుతూ ఉన్నాయి.

ఒకసారి ఆ వనంలోని మహావృక్షాలు పెనుతుఫానుకు కూకటి వ్రేళ్ళతో సహా నేలకొరిగాయి. అందువలన కొన్ని జంతువులు పక్షులు మరణించాయి. మరికొన్ని మరో అడవికి వెళ్ళిపోయాయి. ఇక మిగిలినవి తోటి వారితో ఒద్దికగా చెట్లపై నివసిస్తున్నాయి. వాటిలో కొన్ని గోరువంకలున్నాయి.

ఒకరోజున వాటికి ఒక మంచి ఆలోచన తట్టింది. ఈవనం పెనుతుఫానుకు ముందు ఎల వున్నదో అలా రూపొందించాలని. వెంటనే పలురకాల విత్తనాలకోసం చాలా ప్రదేశాలు తిరిగాయి. రకరకాలైన వృక్షాలను చూచాయి. వాటి కిందరాలిన విత్తనాలను ముక్కునకరచుకొని అడవికితెచ్చాయి. అక్కడక్కడ నేలనుముక్కుతో పొడిచి తెచ్చిన విత్తనములను నాటాయి. ఒక మంచిపనికి దైవము తోడుండునన్నట్లు అడవిలో చిరుజల్లులు పడ్డాయి. కొద్దిరోజులలో విత్తనములు మొలకెత్తాయి. వాటికి తమరెక్కలను విప్పార్చి, అడ్డు

నిలచి, అటువైపు వస్తున్న అడవి జంతువులను తొక్కవద్దని ప్రార్థిస్తూ కంటికి రెప్పలాగా కాపాడుతున్నాయి.

గోరువంకల కృషిని జంతువులు వింతగా చూచి, "ఇవి మా కంటె చాలాచిన్నవి. మాచేతకానిపని వీటివలన అగుట అసంభవం" అని పెదవి విరిచాయి. సాటిపక్షులు కూడా గోరువంకలకుసాయము చేయకపోగా, వాటితో ఓ శారికలారా! చూడగా మీరు పిచ్చివాళ్ళు లాగా వున్నారు. మీ కెందుకీ అవస్థ, మీకు సరిపోను వృక్షములున్నాయి కదా!" అని నిరుత్సాహపరిచాయి.

శారికలు మాత్రము వాటి మాటలు ఏమి పట్టించుకోకుండా ఆత్మవిశ్వాసంతో తమ కృషిని తాము కొనసాగించుచునే వున్నాయి. అప్పుడప్పుడు పడుచున్న వర్షములకు మొలకెత్తిన మొలకలు ఏపుగా పెరగసాగాయి. అటు తరువాత కొన్ని సంవత్సరములకు అవి మహావృక్షములయి, పెద్ద పెద్ద కొమ్మలతో ఊగుతూ. చల్లని గాలులు వీస్తూ, అడవి ప్రాణులకు స్వాగతం పలికినట్లున్నాయి ఇక ఎక్కడెక్కడి పక్షులు, జంతువులు అడవికి చేరాయి. అడవి అంతా మహా వృక్షాలతో నిండి తమకు బాగా రక్షణగా యున్నందున అవి సంతసించాయి. శారికల కృషిని తెలిసికొని, వాటి మంచి మనసును అభినందించాయి.

నీతి : ఆత్మవిశ్వాసమునకు ...



# 27. మూర్ఖులు

పూర్వం యమునానదీ తీరాన ఒక వనంలో ఫలవృక్ష మొకటికలదు. అది పూలతోను, పండ్లతోను బాగానిండి ఆ అడవి కెంతో నిండుదనంగా నున్నది. ఆ చెట్టున చాలా చిలుకలుపండ్లను తిని కిలకిలారావములుచేస్తూ ఆనందంతో కాలం గడుపుచున్నాయి.

ఒకరోజున ఆ వనానికి రెండు పెద్దకోతులు వచ్చాయి. అవి అడవి అంతా తిరిగి. తిరిగి చివరకు ఫలవృక్షం చెంతకు చేరాయి. చెట్టున నిండుగానున్న ఫలములతోపాటు చిలుకలను కూడాచూశాయి. వెంటనే వాటికి ఒక దుర్బుద్ధి పుట్టింది. "ఈ చిలుకలను చంపి ఈ చెట్టు పండ్లను తింటూ మనం యిక్కడే హాయిగావుందాం. ఇక ఏ పక్షిని వాలనివ్వవద్దు." అని చకచక చెట్టెక్కి కొన్నింటిని గొంతునులిమి క్రిందపడవేశాయి మరికొన్నింటిని ముక్కులను కొరికి దూరంగా పారవేశాయి. ఇక మిగిలినవి పారిపోయి, అడవి అంతా గగ్గోలు పెట్టాయి. కోతులుమాత్రం ఆనందంతో కిచకిచ లాడుతూ చెట్టుపైనే వుంటున్నాయి.

ఒక రోజున కొన్ని కాకులు ఆపండ్లచెట్టుపై వాలి, పండ్లను తింటున్నాయి. కోతులు వాటిని పట్టుకోబోతాయి, కాకులు వాటికి చిక్కకుండా తప్పించుకొని పైకెగురుచూ, మరల మరల చెట్టుపై

వాటి పండ్లను పొడుచుకుతింటున్నాయి. కోతులు వాటిని పట్టుకోలేక విసికి, వేసారి చెట్టు కొమ్మలనన్నింటిని విరగతీసాయి. అపుడుకాకులు వెళ్ళిపోయాయి. కోతులు సంతోషంతో కుప్పిగంతులు వేశాయి.

ఆ సమయంలో ఒకకోకిల అటుగావెళ్తూ కోతుల దుశ్చర్యలను చూచి, మనస్తాపము చెంది, వాటి చెంతకుచేరి, "ఓ కపులారా! ఈ కానకు, ఈ ఫలవృక్షం చాలాకాలంనుండి ఫలాలనివ్వడమే కాక, నీడనిస్తూ ఎంతో శోభాయమానంగా నున్నది. ఈ వృక్షము మన కందరికి చాలా ఉపయోగకరమైనది. అటువంటి ఈ వృక్షమును పాడుచేయుట తగదు. కనుకదయచేసి, మీరు మరోచోటికివెళ్ళండి" అని తన సహజ మధుర కంఠంతో ప్రార్థించింది.

కోకిల ప్రార్థనను, మూర్ఖులైన కోతులు పెడచెవిన పెట్టి, హుంకరించుచు, "నీవు మాకు చెప్పేటంతటి గొప్పదానవా! చూడు ఇపుడే నిన్ను ఏమి చేస్తామో!" అంటూ దాని కాళ్ళు పట్టి, రెక్కలు విరగదీసి, గిరగిరా త్రిప్పి దూరంగా విసరివేశాయి.

నీతి : మూర్ఖులకు హితబోధ వ్యర్థము.

 

# 28. బుద్ధి హీనులు

పూర్వం ఒకానొక అడవిలో ఒక చిన్న సరస్సు ఉన్నది. దానిలో ఒకకప్ప, దానికి సమీపంలోగల ఒకచెట్టు క్రిందకలుగులో ఒక ఎలుక ఉన్నాయి.

ఒకరోజున కలుగునుండి మూషికం బయటకి వచ్చి విచ్చలవిడిగా చెట్టుకింద తిరుగుచున్నది. దానినిచూచి కప్పకూడ సరస్సు నుండి వెలుపలికివచ్చి ఎలుకతో "ఓమూషికమా! నిన్ను కాకిచూస్తే తినేస్తుంది. మరినీకు భయంలేదా" అని అన్నది. "ఓ మండూకమా కాకి అంటే నాకు భయం లేనేలేదు. ఒకసారి నన్ను చంపడానికి ఒక కాకి వచ్చింది. అపుడు నేను వెంటనే నోరుతెరచి నా వాడి యైన దంతాలను చూపించాను. ఇక అంతే కాకి వెళ్ళిపోయింది." అని గొప్పలు చెప్పి, మరినీకు కాకి అంటే భయంలేదా అని ఎలుక అన్నది.

కప్ప ఎలుక మాటలునమ్మి తననుగురించి తక్కువగా చెప్పు కోవడం ఇష్టంలేక, "ఓ మూషికమా! ఒకసారి నన్నుపట్టుకోవటానికి ఒకకాకి వచ్చింది. అప్పుడు నేను నాబెకబెక ధ్వనులు వినిపించాను

ఇక అంతే! కాకి భయపడి రివ్వున వెళ్ళిపోయింది," అంటూ బెకబెక మంటూ అరచింది. అపుడు కప్ప మాటలు ఎలుక నమ్మింది.

ఈవిధంగా ఆ బుద్ధిహీనులు ఒకరికొకరు గొప్పలు చెప్పుకుని, ఒకరినొకరిని నమ్ముకుని, "ఇక నుండి మనమిద్దరం కలసి మెలసి ఉందాం." అని నిర్ణయించుకొని చెట్టు క్రింద కలుగులో ఉంటున్నాయి.

ఇట్లుండగా ఒకనాడు సర్పమొకటి ఆహారం కొరకు వెతకుచూ కలుగులోకి ప్రవేశించి, కప్పను, ఎలుకను మ్రింగివేసింది.

నీతి : బుద్ధిహీనులు గొప్పలు చెప్పుకొని ముప్పులు తెచ్చుకొందురు.

 

## 29. ఆవేశం

పూర్వం ఒక రాజుగారి వద్ద చాలా మంది వీరులున్నారు. వారు అనేక యుద్ధాలలో శత్రు సైనికులను చంపి రాజుగార్కి విజయాలను తెచ్చిపెట్టిన ఘనులు. అందుకు రాజుగారు ఆవీరులను మెచ్చుకొని, వారి వారి బలపరాక్రమాలను బట్టి వారికి వెండి, బంగారు పతకములను బహుమతులుగా బహూకరించాడు, మరియు ఘనంగా సన్మానించాడు.

ఒకసారి రాజుగారు వీరులలో గొప్పవారైన ఇద్దరు వీరులను పిలిచి, "శూరులారా! మీరు అరివీరభయంకరులు, మీపరాక్రమము అమోఘం, మీరిపుడు వెళ్ళి మన శత్రురాజైన కళింగుని పట్టి బంధించి తీసుకురండి. ఇతనిని మనము చాలా కాలం నుండి జయించలేకుండావున్నాము.

ఈ పని మీవలన అయ్యేపని వెళ్ళిరండి, అని కత్తులు చేతికి అందించాడు. ఆ మహావీరులు "చిత్తం మహారాజాఅని", కత్తులు ధరించి అశ్వారూడులై కళింగునిపైకి యుద్ధానికి వెళ్ళారు. పోరు ఘోరంగా చేసి, కళింగుని జయించి, పట్టి బంధించి, తెచ్చి రాజు ముందుంచారు. రాజు కళింగుని చెరసాల బద్దునిగాచేసి, తమ వీరులను ఎంతగానో మెచ్చుకొన్నాడు, ఆనందించాడు. వారిని ఘనంగా సన్మానించాలనుకొన్నాడు. మంత్రితో సమాలోచన చేసి, తన రాజ్యంలో కొంతభాగం బహుమతిగా వీరులకు ఇవ్వాలని నిర్ణయించి, ఉత్తర్వులను తయారు చేయించి, రాజముద్రికలువేశాడు.

ఇక రాజుగారి గొప్ప మనసును గ్రహించలేని ఆవీరులు తమకు బహుమతులేవి యివ్వనందుకు, ఆలోకంతామధనపడి చివరకు ఆవేశపరులై, రాత్రి సమయములో రాజ భవనంలో ప్రవేశించి, రాజుగారిని హతమార్చబోయి, భటులకు పట్టు పడ్డారు, తరువాత

రాజుగారి గొప్ప మనసును తెలిసికొని తమకు తమ వీరత్వము వలన వచ్చిన కీర్తిని, తమ ఉద్రేకం వలన పోగొట్టుకొన్నందుకు వగచారు. పదిమందిలో పలుచనై నవ్వులపాలైనారు. తమపరాక్రమం బూడిదలో పోసిన పన్నీరైనందుకు కుమిలిపోయారు. ఆవేశం తమ అదృష్టాన్ని మంటగలిపిందని కూడా అర్థం చేసుకొన్నారు. చేసిన నేరానికి జీవితాంతం కారాగారశిక్ష అనుభవించుచు పశ్చాత్తాపంతో కృంగి, కృశించి నీరసించి నశించారు.

**నీతి :** ఆవేశం అపకీర్తినేగాక కష్టాలను కూడా తెచ్చిపెట్టును.

 

## 30. బలం

పూర్వం ఒకానొక వనంలో ఒక మదపుటేనుగు వున్నది. అది ఆఅడవి జంతువులకి తన గర్వాన్ని చూపిస్తూ నేనే ఈఅడవికి రాజును నాకెవరైనా ఎదురు తిరిగినా వారిని నా తొండంతో పట్టి కాళ్ళతో నొక్కి చంపిపారేస్తాను జాగ్రత్త! అని హెచ్చరిక చేసింది.

ఒక రోజున ఆ ఏనుగు అడవి జంతువులన్నింటిని సమావేశ పరచి వాటిలోనొకటైన కుందేలుతో "నాకు ప్రతిరోజు నీవు పండ్లు, ఆకులు ఆహారంగా తెచ్చి పెట్టాలని ఆదేశించింది." అప్పుడా కుందేలు నివ్వెరపోయి "నీవు అంత వున్నావు. నేను ఇంత కూడా లేను. కనుక నీకు ఆహార తెచ్చిపెట్టడం నాచేతకానిపని అసలు మీరే మాకందరికి తిండి తెచ్చి పెట్టాలి," అని మారు పల్కింది. వెంటనే ఏనుగు ఆగ్రహించి కుందేలును తొండంతో పట్టి, స్తంభాల్లాంటి కాళ్ళతో నొక్కి చంపేసి, మిగిలిన జంతువులతో మీకందరికి ఇదే గతి పడుతుంది, వెళ్ళి నాకు ఆహారం తెచ్చి పెట్టండని పెద్దగా ఘీంకరించింది. జంతువులన్ని భయంతో గజగజ వణికాయి. అప్పటి నుండి జంతువులు చాలా కష్టపడి, ఏనుగుకు ఆహారం తెచ్చిపెడుతున్నాయి.

ఒక రోజున ఆ జంతువులు, అడవిలోని ఒక పండ్లచెట్టు కొమ్మకు ఒక పెద్ద తేనెతుట్టెను చూచాయి. వెంటనే వాటికి ఒక ఆలోచన తట్టింది. బలగర్వంతో విర్రవీగుచున్న గజరాజుకి కళ్ళు తెరిపించాలని ఇక జంతువులన్నీ ఏనుగు దగ్గరకి వచ్చి "గజ రాజా! ఈ వనంలోని ఒకపండ్లచెట్టు కొమ్మకు ఒక పెద్ద తేనె

తుట్టెవున్నది. దానినిండా తేనెటీగలున్నాయి. మేము వాటితో మీరు వెళ్ళిపోండి మా గజరాజుకి పండ్లు తీసుకెళ్ళాలని అన్నాము. కాని అవి మాపై కోపించి మా వెంటపడ్డాయి. ఇక మేము చేసేదిలేక మీ దగ్గరకు పరుగుతీశాము. మీరు ఆ చెట్టుకొమ్మను తొండంతో విరిచి పారేయండి ఆ తేనెటీగలు వెళ్ళిపోతాయి. అని ముక్త కంఠంతో పలికాయి.

అంతట ఏనుగు "ఆ చెట్టు కొమ్మనేకాదు, చెట్టును కూడా పీకిపారేస్తాను. పదండి చెట్టును చూపించండి" అని వాటివెంట చెట్టుదగ్గరకి పరుగుతీసింది. జంతువులు చెట్టుననున్న తేనెతుట్టెను చూపించాయి. ఏనుగు గర్వంతో "ఈ అడవిలోనున్న మీకేగాక ఈ తేనెటీగలకు కూడా నేనేరాజును చూడండి," అంటూచెట్టును తొండంతో చుట్టి బలంగా అటు నిటు కదలించి, వేళ్ళతోసహా నేలకూల్చింది. అపుడు తేనెటీగలు తమ నివాసమైన తుట్టను చిందర వందరచేసినందుకు కోపించి, ఏనుగు తొండాన్ని కాళ్ళను కుట్టి పెట్టడం మొదలెట్టాయి. ఏనుగు వాటి బారినుండి తప్పించుకోవ డానికి పిచ్చి పట్టిన దానిలాగా పరుగులు తీసింది. కాని అవి ఏనుగును వదలి పెట్టక కసితీరాకుట్టాయి. అపుడు ఏనుగు సొమ్మ సిల్లి, కిందపడి బాధతో రోదించుచు జంతువులతో, "నన్ను

క్షమించండి. మిమ్మల్ని చాలా కష్టపెట్టాను జంతువులన్నింటిలోను బలశాలిని మరియు పెద్ద జంతువైన నేను, చిన్నవైన మిమ్ములను ఆహారం తెచ్చిపెట్టమని బలగర్వంతో కష్టపెట్టాను మారు పల్కిన కుందేలును దారుణంగా చంపిన పాపానికి ఫలితం అనుభవిస్తున్నాను. ఇపుడు బాధ ఎటువంటిదో అర్థమయింది," అని కన్నీరు కార్చసాగింది.

అంత జంతువులు ఏనుగుపడే బాధనుజూచి జాలిపడి ఆకుల పసరులను ఔషధ వనమూలికలను తెచ్చి తగిన చికిత్సచేశాయి. కొద్దిరోజులలో ఏనుగు కోలుకొని, "ఇకనుండి మీతో కలసి మెలసి తిరుగుతూ, మీకు ఆహారం తెచ్చిపెడ్తూ తోడు నీడలాగా వెన్నంటే వుంటాను," అని వినయంగా పలికింది.

నీతి : బలం ఉన్నదికదా అని గర్వంతో పొంగిపోరాదు.



# 31. కానివానితో స్నేహము

ఒకప్పుడు హిమాలయాల్లో మానస సరోవరము నుండి ఒకానొక హంస దక్షిణాపథము నందలి గోదావరీ తీరానికి వచ్చి అందలి వింతలు, విశేషాలు చూస్తూ వున్నది. ఆ సమయంలో ఒక కొంగ ఆ హంసను వింతగా చూచి, దాని దగ్గరకు పోయి ఇట్లు ప్రశ్నించింది ఆశ్చర్యంగా "ఎవరు నీవు? నీ ఆహారమేమి? నీదేశ మేది?"

"నేను హంసను! శరత్కాలములో వెన్నెల ఎంత తెల్లగా వుంటుందో, అంతతెల్లని వర్ణముగలదానను. మానస సరోవరంలోని తామర తూడులోని సన్నని దారము నాకు ఆహారము. ఉత్తరాపథములోని హిమాలయ పర్వత ప్రదేశములలోని మానస సరోవర ప్రాంతము మా దేశము. అక్కడే గంగానది పుట్టింది. అది చాలా పవిత్రమైనది" అన్నది హంస. ఆ మాటలకు బకము ఆశ్చర్యపడి తాను హంసలాగా జీవించాలని హంసలతో కలసిమెలిసి వుండాలని కోరిక గల్గి హంసతో "మిత్రమా! నీతో స్నేహము చేసి నన్ను నీతో మానస సరోవరమునకు తీసుకొని పొమ్ము" అని ప్రాధేయపడింది.

హంస కొంగమాటలకు జాలిపడి కొంగను గూర్చిఏమి తెలుసుకొనకనే "సరే" అని అంగీకారం తెలిపింది. అప్పటినుండి కొంగ - హంస కొద్దికాలము గోదావరీ తీరమునందలి సరస్సులను జూచి

మానస సరోవరానికి ప్రయాణమైనాయి. కొంగ హంసతో చెలిమి చేసినంత కాలము చేపలను పీతలను ముట్టకొనకుండా, శాకాహార మునే తింటూ హంసకు తనసుగూర్చి ఏమాత్రము అనుమానము రాకుండా ఉండేలా నడుచుకుంది.

హంసముందు దానివెంట కొంగ ఆకాశాన రివ్వునపోసాగాయి. గంగానదీ తీరము వచ్చినది. అచ్చటజాలరులు చేపలుపట్టి కుప్పలు కుప్పలుగా తీరాన పోస్తున్నారు. అవి ఎండకు తళ తళలాడుతూ మెరుస్తున్నాయి. హంస వాటినేమి పట్టించుకోక వెళ్ళుతున్నది. కొంగ క్రిందనున్న చేపలనుజూచి ఇవి ఎంత రుచిగా వుంటాయో అనుకొని తన జిహ్వా చాపల్యము చంపుకోలేక నేస్తాన్ని మరచి, నదీతీరాన వాలి ఒక్కసారిగా ముక్కున చేపను కరచుకొని పోసాగింది. అది గమనించినజాలరి ఆవేశముతో వడిసెలతో రాయిని రివ్వునవిసిరాడు. ఆ రాయి ముందుపోవుచున్న మరాళానికి తగిలింది. అది శీఘ్రమే పైనుండి గిరగిర తిరుగుచూ, నేలపైబడి తన్నుకొనుచు ప్రాణాలు వద లింది. హంస, కానివానితో స్నేహముచేసి ప్రాణాలు వదలింది.

నీతి : కానివానితో తోడ గలసి వర్తించెనా
హాని వచ్చు నెంతవానికైనా
తాటి క్రింద పాలు ద్రాగిన ఉందమా
విశ్వదాభిరామ వినురవేమ

# 32. సమయస్ఫూర్తి

పూర్వం ఒకానొక దట్టమైన వనంలో చాలా జంతువులు ఉన్నాయి. వాటిలో జింక యొకటి కలదు. దాని తలకు చెట్టు కొమ్మలులాగా పదునైన కొమ్ములున్నాయి. అది అడవిలో సంచరించుచు పచ్చిక బాగా మేయుచు బలిసియున్నది. అది ప్రతి రోజు అడవిలోని సరస్సుకు నీరు త్రాగడానికి వచ్చి, తనవాడియైన కొమ్ముల ప్రతిబింబమును నీటిలో చూచుకొని మురిసిపోయి. ఇవి నాకు ప్రస్తుతము ఉపయోగపడకపోయినను, ఎప్పటికైనను నన్ను నేను రక్షించుకోవటానికి ఉపయోగపడునని మనసున తలచి, నీరు త్రాగి పచ్చికను మేసి తన వాసమునకు చేరుచున్నది. ఇట్లు కొంత కాలము గడిచినది. అదృష్టవశమున జింక ఇంకను పులి కంట పడియుండలేదు.

ఒకనాడు జింక ఎప్పటియట్లు సరస్సునకు వచ్చి నీరు త్రాగుచున్నది. అ సమయంతో, పులి నీరు త్రాగటానికై సరస్సు అవతలి తీరానికివచ్చి నీరు త్రాగుచున్న జింకను చూచి, "అహా! ఈరోజు నాపంట పండింది" అనుచు జింకకోసమై పరుగున రాబోవుచున్నది. అంతట జింక పులిని గమనించింది. దాని గుండెలు బద్దలయినవి. ఇంక చేసేదిలేక జింక గుండె దిటవుచేసుకొని సమయస్ఫూర్తితో, "ఓవ్యాఘ్రమా! అగుమాగుము. నాతలకుగల ఈకొమ్ములు అత్యంత విషపూరితమైనవి. నైమిశారణ్యములోని ఒక మునీంద్రుడు నన్ను బాల్యమునుండి అతిగారాబముగా పెంచి, నారక్షణార్థమై ఏ క్రూర

జంతువు నన్ను హింసించకుండ నుండుటకై, నాశృంగములను తన మంత్రశక్తిచే విషపూరితము గావించినాడు ఒకసారి సింహామొకటి నాపైకి దుమికినది. అపుడు నేను నా విషశృంగములచే దాని శరీరమును పొడిచితిని. ఇక అంతే ఆసింహాము క్రిందపడి కన్నుమూసినది తదాదిగా నన్ను చూచిన క్రూర మృగములన్నియు నా జోలికి రాకయున్నవి. కనుక నీవును, నీదారిన వెళ్ళిన వెళ్ళుము. లేనిచో నన్ను ఎదుర్కొని నావాడియైన విషకొమ్ములకు బలియగుదువేని నేను సిద్ధముగానున్నాను రమ్ము" అని మేకపోతు గాంభీర్యము చూపుచు రాయి వలె నిశ్చలముగానున్నది.

అంత పులి జింక మాటలు విని, నిజమే కాబోలు లేనిచో నన్ను చూడగానే పారిపోయివుండెడిది. కనుక దీనిని యిపుడు నేను ఎదుర్కొనుట నా వినాశమునకే కారణమగును, అని తలిచి నీటినికూడ త్రాగక వచ్చినదారినే వెళ్ళిపోయినది.

అలా పులి వెళ్ళగానే జింక గుండె నిమురుకొనుచు, తన యిరవునకుపోయి, తన శృంగములు "ఈ సమయంలో తన సమయస్ఫూర్తికి కారణములైనందుకు మెచ్చుకొనినది.

నీతి : సమయస్ఫూర్తితో ఆపదనుండి తప్పించుకొనవలెను.

